# ఆస్తి పరివర్తన శాసనము.

అనగా,

స్తినైనను స్థిరాస్తినైనను ట్రాన్సుఫరు చేయుటము, స్థిరాస్తి విక్రయములు-తాకట్లు - దానిమీది పూచీలు, తనఖావిడుదల, ముందటి తనఖాకులోబడియున్నాస్తిని విక్రయించుట, విపరీతపు తనఖాలు, స్థిరాస్తి గుత్తలు, మారుపులు, దానములు మొదలగు స్థిరాస్తితో సంబంధించిన అనేకముఖ్యమయిన విషయములను గురించిన

## 1882 వ సంవత్సరపు 4 వ శాసనము.

[౧౯౨౯ వ సం॥ ఏప్రిల్ వరకు సవరణచేయబడిన ప్రకారము.]

---

ఇది,

స్థిరాస్తిగలవారందరికిని, దానిని తాకట్టుంచుట, తాకట్టుంచుకొనుట మొదలగు వ్యాపారములను చేయు వారికిని మిగుల సుపయుక్తము.



MADRAS:
Printed and Published at The Indian Law Press,
*72, Govindappa Naick Street.*

---

"రిజిస్టరు" స్తకము కావలసినవారు చన్నపట్నము గోవిందప్పనాయని వీధి ను క్రమసంఖ్య నుంచు శ్రీ ఇండియన్ లా రిపోర్టుల సంగ్రహకర్తగారికి దరఖాస్తు పంపించి బ్రిటిషు ను, వెల వ్యాల్యూపేయబిల్ పోస్టుద్వారా రు ౧-౭-౦ లు.

# ఆస్తి పరివర్తన శాసనము.

౧౮౮౨ వ సంవత్సరపు ౪ వ నంబరు ఆక్టు.

---

ఆలోచనసభలోని ఇండియా గవర్నర్ జనరల్ గారిచే చేయబడినది.

కక్షిదారుల వ్యవహారమువల్ల ఆస్తి పరివర్తన విషయ
మయిన చట్టమును సవరించుటకు పుట్టిన ఆక్టు.

[౧౮౯౩ వ సం॥ ఏప్రిలు మొదటితేదివఱకు సవరింపబడిన విధముగా.]

పీఠిక.

కక్షిదారుల వ్యవహారమువల్ల ఆస్తి పరివర్తన విషయమయిన చట్టము యొక్క కొన్నిభాగములను నిర్వచించి సవరించుట యుక్తముగా ఉండుటచేత, ఇందుమూలముగా ఈక్రిందవిధించే దేమనగా:—

(శ్రీ)

## ౧ టో అధ్యాయము.

### ప్రథమాంశములు.

సంగ్రహ నామము.

౧. ఈ ఆక్టు ౧౮౮౨ వ సంవత్సరపు ఆస్తి పరివర్తన ఆక్టు అనిచెప్పవచ్చును.

ప్రారంభము.

ఇది ౧౮౮౨ వ సం॥ జూలై నెల మొదటి తేదిని అమలులోనికి రావలయును:

వ్యాప్తివిస్తారము.

"రిజిస్టరు

ఇది మొట్టమొదట, ఆలోచనసభలోని బొంబాయి గవర్నరుగారిచేత, పంజాబు లెఫ్టినెంటు గవర్నరుగారిచేత, బ్రిటిషు బర్మా ప్రధాన కమ్మిషనరుగారిచేత, వరుసు క్రమపఱులింపబడు రాజ్యములందు తప్ప యావత్తు బ్రిటిషు ఇండియా రించి బ్రిటిష్ తిణంచును.

కాని, సదరు ప్రదేశ గవర్నమెంటు వారలలో ఎవరయినను, తమపరిపాలనలో ఉన్నరాజ్యముల అన్నిటియందుగాని లేక అందలి యేభాగమందయినగాని లోకల్ అఫిషల్ గెజెటులో ప్రకటనద్వారా అప్పటప్పటికి ఈ యాక్టును వర్తింపజేయవచ్చును.

మఱియు ఏ ప్రదేశ గవర్నమెంటువారయినను ఆలోచనసభలోని గవర్నర్ జనరలుగారి అనుమతిని ముందుగాపొంది, అట్టిప్రదేశ గవర్నమెంటు వారిచే పరిపాలింపబడు దేశములలో ఏ భాగమునయిన, ఈ క్రింద ఉదాహరింపబడియుండునిబంధనలు అన్నిటినుండి అయినను, లేక వానిలో దేనినుండి అయినను, గతకాలమపేక్షించికాని భావికాలమపేక్షించికాని సంబంధపడునట్లు అప్పుడప్పుడు లోకల్ అఫిషల్ గెజెటులో ప్రకటనద్వారా మినహాయించవచ్చును, సదరునిబంధనలు ఏవనగ :—

౫౪గో సెక్షను ౨, ౩ పేరాలు, ౫౯, ౧౦౭, ౧౨౩ సెక్షనులు.

ఈ సెక్షనులో పూర్వభాగమందేది ఉండినను నిమిత్తములేకుండ, ౫౪గో సెక్షనులోని ౨, ౩పేరాలు ౫౯, ౧౦౭, ౧౨౩ సెక్షనులు ౧౮౭౭ వ సంవత్సరపు రిజిస్ట్రేషను ఆక్టులోని మొదటిసెక్షను వలనగానిఇంకేవిధమునగాని కలుగజేయబడిన అధికారమునుబట్టి సదరుఆక్టుయొక్క ఆమలులో నుండి అప్పటికి తప్పించబడిన ఏ డిస్ట్రిక్టునందుగాని లేక దేశభాగమందుగాని వర్తింపనుగూడదు, మఱియు వర్తింపజేయనుగూడదు.

ఆక్టుల రద్దు.

౨. ఈ యాక్టు తత్కాలమందు వర్తించు దేశములలో ఇందుతో జతపఱుచబడ్డపట్టీలో చెప్పబడియున్న చట్టములను అందులో ఉదాహరింపబడి యున్నంతవఱకు రద్దుచేయవలయును. కాని, ఇందులో ఉండునది ఏదియు—

కొన్నిచట్టములు, సంగతులు, హక్కులు, జవాబుదారీలు, మొదలయినవానిని మినహాయించుట.

(ఎ) ఇందువల్ల పేర్కొని రద్దు
ఏ చట్టముయొక్క నిబంధనలనయిన



(బి) ఈ యాక్టు నిబంధనలకు అనుగుణ్యమయి తత్కాలమందు అమలులో ఉన్న చట్టమువల్ల ఏర్పడిన కరారుతోగాని ఆస్తి స్వరూపముతోగాని చేరిన ఏ షరతులనయినను సంగతులనయినను,

(సి) ఈ యాక్టు అమలులోనికి రాకముందు ఏర్పడ్డ చట్టసంబంధమువల్ల గలుగు హక్కు అయినను జవాబుదారీ అయినను లేక అట్టి ఏహక్కునుగుఱించికాని జవాబుదారీనిగుఱించికాని ఏ సదుపాయమునయినను, లేక

(డి) ఈయాక్టుయొక్క ౫౭డో సెక్షనులోను ౪గో అధ్యాయములోను చెప్పబడ్డరీతినితప్ప, చట్టవిధానమువలనగాని, లేక తగిన విచారణాధికారముగల కోర్టువారుచేయు డిక్రీవలనగాని, ఉత్తరవువలనగాని, లేక దానిని అమలుకు తెచ్చుటకుగాని, కలిగెడు ఏ పరివర్తననయినను,

బాధించునట్లు తలచగూడదు:

మఱియు ఈయాక్టుయొక్క ౨డో అధ్యాయమందు ఉండునది ఏదియు హిందూ మహమ్మదీయ బౌద్ధమత ధర్మశాస్త్రవిధిని దేనినయిన బాధించునట్లు తలచగూడదు.

అర్థ బోధకపు క్లాజు.

౩. ఈ యాక్టులో విషయమందుగాని లేక పూర్వోత్తర సందర్భ మందుగాని ఏది అయిన విరుద్ధమగునది ఉండిననేతప్ప,—

"స్థిరాస్తి" అను దానిలో చెట్లుగాని పెఱుగుచుండు పైరుగాని గడ్డిగాదముకాని చేరవు :

"పత్రము" అనగ మరణశాసనసంబంధముకాని పత్రముఅనిఅర్థము:

"రిజిస్టరు చేయబడినది" అనుదానికి దస్తావేజులను రిజిస్టరుచేయుటను క్రమపఱుచుచు తత్కాలమందు అమలులో ఉండు చట్టమును అనుసరించి బ్రిటిష్ ఇండియాలో రిజిస్టరు చేయబడినది అని అర్థము:

"భూమికిజేర్చబడిన" అనుదానికి—

(ఏ) చెట్టుచేమలవలె భూమిలో వేరుకొని ఉన్నదని, లేక

(బి) కుడ్యగృహములవలె భూమిలో పాదుకొని ఉన్నదని, లేక

(సి) దేనికి అది చేర్పబడి ఉన్నదో దానిని శాశ్వతప్రయోజనకరముగా అనుభవించుకొరకు ఆప్రకారము పాదుకొనియున్నదానికి చేర్పబడి ఉన్నదని.

అర్థము.

ఒకడు ఒక సంగతిని వాస్తవముగా ఎఱిగినయెడలనుగాని లేక తాను చేయవలయు విచారణనయినను పరిశోధననయినను చేయక బుద్ధిపూర్వకముగ మానుకొనకున్నను లేక మిక్కిలి అశ్రద్ధలేకున్నను వానికి తెలిసి ఉండినయెడల, లేక ౧౮౭౨ వ సంవత్సరపు ఇండియా కరారు ఆక్టులోని ౨౨౯ వ సెక్షనులో చెప్పియున్న కారణములనుబట్టి అతని ఏజంటుకు ఆ సంగతియొక్క వర్తమానము తెలియజేయబడి ఉన్నయెడలను, లేక అతడు తెలిసికొని ఉన్నయెడలను, అతడు ఆసంగతిని గుఱించి "నోటీసు" పొందినట్లు చెప్పబడును.

కరార్ల విషయమయిన చట్టములు కరారు ఆక్టుభాగముగా గ్రహించుట.

౪. కరారును గుఱించి సంబంధపడు ఈ యాక్టుయొక్క అధ్యాయములును సెక్షనులును ౧౮౭౨ సంవత్సరపు ఇండియా కరారు ఆక్టుభాగముగానున్నట్లు అన్వయించుకొనవలయును.

మఱియు ౫౪గా సెక్షను ౨, ౩ పేరాలును ౫౯, ౧౦౭, ౧౨౩ సెక్షనులను ౧౮౭౭డో సంవత్సరపు ఇండియారిజిస్ట్రేషనుఆక్టునకు ఉపభాగములుగా జదువుకొనవలయును.



౨డో అధ్యాయము.

కక్షిదారుల వ్యవహారమూవలన ఆస్తిని పరివర్తనచేయుటలను గుఱించి.

(ఏ)— చరాస్తినైనను స్థిరాస్తినైనను పరివర్తన చేయుట.

"ఆస్తి పరివర్తన" నిర్వచనము.

౫. ఈదిగువవచ్చు సెక్షనులలో "ఆస్తి పరివర్తన" అనగ సజీవుడగు మనుష్యుడు, ప్రస్తుతకాలమందుగాని లేక భావికాలమందుగాని సజీవుడగు ఒక వేఱుమనుష్యుని పరముగాని లేక సజీవులగు ఎక్కువమంది ఇతర మనుష్యుల పరముగాని, లేక తనపరమును సజీవులగు ఒకడు లేక ఎక్కువమంది యితర మనుష్యులపరమును చేయుకార్యము అని అర్థము; మఱియు "ఆస్తి పరివర్తనచేయుట" అనగ అట్టి కార్యమునుచేయుట.

దేనిని పరివర్తన చేయగూడును.

౬. ఈ యాక్టువల్లగాని తత్కాలమందు అమలులో ఉన్న ఏదయిన ఇతర చట్టమువల్లగాని మఱియొక విధముగా ఏర్పాటుచేయబడియుండిన తప్ప, ఏవిధమయిన ఆస్తి అయినను పరివర్తనచేయబడవచ్చును:

(ఏ) సంస్థానమునధిష్ఠించు యువరాజునకు గలుగుయోగము, దాయాది మరణము నొందిన తర్వాత బాధ్యస్థుడగువాడు మరణశాసనమూలముగా పొందు సొత్తు, లేక తత్సంబంధమయిన ఏ వట్టి ప్రాప్తి అయినను పరివర్తన చేయబడజాలదు.

(బి) అంతకు ముందు చేసికొనిన షరతు భంగమయి పోవగ, పునస్సంపాదిత మగు వట్టిహక్కు తద్వారా నష్టమును పొందిన యజమానునికి తప్ప ఇతరులకు పరివర్తన చేయబడజాలదు.

(సి) అనుభోగబాధ్యత ప్రబలనగు దాయమునుండి ప్రత్యేకముగ పరివర్తనచేయబడ జాలదు.

(డి) యజమానుడగు వాడు మాత్రము స్వీయముగ నను భవించుటకు పరిమితి ఏర్పఱుపబడిన ఆస్తిపైని హక్కు అతనిచే పరివర్తన చేయబడ జాలదు.

(ఇ) మోసము చేసినందువలనగాని లేక అధర్మముగా గలుగ చేసిన హాని వలనగాని సంభవించు నష్టము పయిని తత్ప్రతికార ద్రవ్యప్రాప్తికై వ్యాజ్యము తెచ్చుటకు ఉండునట్టి వట్టి హక్కు పరివర్తన చేయబడ జాలదు.

(ఎఫ్) సర్కారు ఉద్యోగము పరివర్తన చేయబడ జాలదు ; మఱియు సర్కారు ఉద్యోగస్థుని జీతము దేయోచిత మగుటకు పూర్వము కాని దేయోచితమైన తర్వాతగాని పరివర్తన చేయబడజాలదు.

(జి) గవర్నమెంటు మిలిటరి, సివిలు, ఇలాకా పించన్‌దార్లకు ఈబడు జీతములు ఏమి రాజాంగ సంబంధమయిన పించనులు ఏమి పరివర్తన చేయబడ జాలవు.

(ఎచ్)(౧) పరివర్తనవలన బాధకము కలిగింపబడిన హక్కు స్వభావమునకు విరోధించు నంతవఱకును, లేక (౨) అక్రమమగు కార్యము కొఱకును, లేక (౩) పరివర్తన కొనుటకు చట్టమునుబట్టి అనర్హుడయిన పురుషునికిని, ఏ పరివర్తన చేయబడ జాలదు.

(ఐ) స్వాధీనహక్కును పరివర్తన చేయజాలని కాపునకుగాని, ఎస్టేటు బాబతు రెవిన్యూ చెల్లించుటలో లోపము చేసిన ఎస్టేటుయొక్క రయితుకుగాని, కోర్ట్ ఆఫ్ వార్డ్సు వారి నిర్వాహకమందుండు ఎస్టేటు గుత్తకానికిగాని, సదరు కాపుగాను, ఎస్టేటుయొక్క రయితుగాను, ఎస్టేటు గుత్తకాడుగాను, ఉండుటకు తనకుగల హక్కును తత్కాలమునకు వదలుకొని యితరుల కొప్పించుటకు ఈ సెక్షను లోనుండు ఏదియు అధికారమిచ్చునట్లు తలపగూడదు.

పరివర్తనార్హులైనవారు.

౭. కరారు చేయుటకు అర్హుడును, పరివర్తనార్హమగు ఆస్తిపయిన హక్కు కలవాడును, లేక పరివర్తనార్హమగు



స్వీయము కాని ఆస్తిని పరిష్కరించుటకు అధికారము పొందిన వాడును, అగు ప్రతి మనుష్యుడు, సదరు ఆస్తిని యావత్తుగాని భాగముగా తీసికొని నిబంధన రహితముగానయినను నిబంధన సహితముగానయినను తత్కాలమందు అమలులో నున్న ఏ చట్టమయిన అంగీకరించి విధించు నంతమట్టుకు గాని తద్రీతిగా గాని అప్పటికి ఉన్న స్థితిగతులను బట్టి పరివర్తన చేయుట కర్హుడయి వుండును.

పరివర్తన చెల్లుబడి.

౮. భేదోద్దేశము స్పష్టముగా జెప్పబడికాని, లేక ఆవశ్యకముగా స్ఫురించుచుగాని ఉండిననే తప్ప, తన ఆస్తి పయినను, తత్సంబంధము లగు చట్టసమ్మతములగు సంగతుల పయినను, పరివర్తన కర్త అప్పుడు తాను పొందిన అధికారమును వదలుకొనుటకు అధికారమిచ్చు హక్కు యావత్తు పరివర్తన చేకొనువానికి తక్ష[illegible]పడును.

అట్టి సంగతులు, ఆస్తి భూమిగా నున్నయెడల, అందుతో జత పఱుపబడ్డ అనుభోగ బాధ్యతలు, పరివర్తనకు తర్వాతవచ్చు అందఱి అద్దెలు, లాభములు, భూమికి జేర్పబడ్డ అన్ని వస్తువులను,

ఆస్తి భూమికి జేర్పబడిన యంత్రసామగ్రిగా నున్నయెడల, విడదీయదగిన అందఱి భాగములను.

ఆస్తి ఇల్లుగానున్నయెడల, అందుతో చేరిన అనుభోగ బాధ్యతలు, పరివర్తనకు తర్వాతవచ్చు అందఱి అద్దె, తాళములు, తాళపు చెవులు, క[illegible]లు, తలుపులు, కిటికీలు, మఱియు అందుతోడ శాశ్వతముగా ఉపయోగించుకొనుటకు ఏర్పఱుపబడిన ఇతరవస్తువుల నన్నిటిని,

ఆస్తి ఋణముగాగాని లేక వ్యాజ్యమాడదగిన యితర దావాగాగాని ఉన్నయెడల, పరివర్తనకు పూర్వము కలుగు వడ్డి బాకీని [illegible], ఆ ఋణము వగయిరాలకు గల పత్రములను, (పరివర్తన చేకొనినవానికి పరివర్తన చేయబడని యితర ఋణములకు లేక దావాలకుగూడ సదరు పత్రములు సంబంధించు సంగతిలో మాత్రము కాదు),

మఱియు, ఆస్తి పయికముగా నయినను రాబడికల ఇతర ఆస్తిగానైనను వున్న యెడల, పరివర్తన అమలులోనికి వచ్చిన తర్వాత చేరెడు అందలి వడ్డినిగాని లేక రాబడినిగాని,
కలుపుకొనుచున్నవి.

వాగ్రూప పరివర్తన.

౯. చట్టమునుబట్టి వ్రాత స్పష్టముగా ఆవశ్యకము కాని ప్రతి సంగతిలోను వ్రాత లేకయే ఆస్తి పరివర్తన చేయబడవచ్చును.

పరాధీనము చేయుటను బాధించు షరతు.

౧౦. ఆస్తిపయినగల హక్కునువదలుకొనకుండగాని విక్రయించకుండగానిపరివర్తనచేకొనువానినయినను లేకవాని ద్వారా బాధ్యతను కనబఱుచు ఏమనుష్యునయినను పూర్ణముగా నిర్బంధించు షరతుగాని పరిమితికిగాని లోబఱచి ఆస్తిని పరివర్తనచేయు సంగతిలో, సదరుషరతు గుత్తకిచ్చు వానికిగాని అతని ద్వారా బాధ్యతను కనబఱుచు మనుష్యులకుగాని లాభకారియైయుండు గుత్తవిషయములోతప్ప, సదరుషరతును పరిమితియును చెల్లవు: అయినను ఆస్తి (హిందూ మహమ్మదీయ బౌద్ధ మతములలో జేరని) స్త్రీకిగానిలేక ఆమె లాభముకొఱకుగాని పరివర్తనచేయబడవచ్చును; కాని ఆమె వివాహకాలమందు దానినిగాని అందుగల ఆమెయొక్క లాభకరమగు హక్కునుగాని పరివర్తనచేయుటకు, లేక దానిపయి తాకట్టు మొదలయిన వాని మూలముగ సొమ్మును వసూలుచేసికొనుటకు ఆమెకు అధికారముండగూడదు.

కలుగజేయబడిన హక్కుకు విరుద్ధమైన నిర్బంధము.

౧౧. ఆస్తి పరివర్తనానంతరము, ఒకానొక మనుష్యుని పరమున అందులో సంపూర్ణముగా హక్కు పుట్టియుండి, ఆ పరివర్తన నిబంధనలు సదరు హక్కు నిర్దిష్టవిధముగా చెల్లునట్లును అనుభవము లోనికి తేబడవలయునట్లును విధించునపుడు, అట్టివిధిలేనట్లే తనహక్కును పొందుటకును పరిష్కరించుకొనుటకును వాడు అధికారము కలిగివుండవలయును.



ఈ సెక్షనులో నుండు ఏదియు, స్థిరాస్తిలోని ఒకభాగమును లాభకరముగా అనుభవించు నిమిత్తము, అట్టి ఆస్తితాలూకు మఱియొక భాగముయొక్క అనుభవమును ఆటంకపఱుచునట్టిగాని లేక నిర్దిష్టవిధముగా దానిని అనుభవించునట్లు బలవంతపఱుచునట్టిగాని హక్కునకు బాధకముకలిగించునట్లు ఎంచగూడదు.

ఋణముతీర్చుటకు శక్తి చాలనపుడుగాని పరాధీనముచేయ ప్రయత్నించునపుడుగానిహక్కు అంతమొందునను షరతు.

౧౨. ఎవడైన ఒకడు ఋణముతీర్చుటకు శక్తిలేనివాడైన మీదటగాని ఆస్తిని పరివర్తనచేయుటకయినను దానిని పరిష్కరించుటకయినను ప్రయత్నము చేసిన మీదటగాని నిలిచిపోవులాగు అతని లాభముకొఱకు నిలుపుకొనికాని లేక ఇచ్చికాని అందులో హక్కును దేనినయిన గలుగజేయు షరతుకయినను పరిమితికయినను లోబడి ఆయాస్తి పరివర్తనచేయబడునెడల అట్టి షరతుగాని పరిమితిగాని చెల్లనేరదు.

ఈ సెక్షనులో నుండునది ఏదియు గుత్తకిచ్చువానియొక్కగానిలేకవాని ఆధారమున దావాచేయు వారియొక్కగాని లాభముకొఱకు ఇచ్చిన గుత్తలోనిషరతుకు సంబంధపడగూడదు.

పుట్టియుండని వాని లాభముకొఱకు చేయు పరివర్తన.

౧౩. ఆస్తి పరివర్తనవలన గలుగచేయబడిన ప్రథమహక్కునకులోబడి, ఆయాస్తి పరివర్తన చేయబడిన మీదట ఆ పరివర్తన తేదీని పుట్టి యుండని మనుష్యునియొక్క ఉపయోగార్థము అందులో హక్కు కలుగచేయబడునెడల, ఆయాస్తిపై పరివర్తన చేయువానికిగల యావత్తు మిగత హక్కునకును వ్యాపించి యుండిననేతప్ప, అట్టి మనుష్యునియొక్క ఉపయోగము నిమిత్తము కలుగచేయబడు హక్కు [illegible]

## దృష్టాంతము.

ఏ అనువాడును, వాడు ఉద్దేశించుకొనిన భార్యయు వారి జీవితపర్యంతము ఒకరి తర్వాత ఒకరికిని, వారిలో కడపట జీవించియుండువారి మరణానంతరము సదరు ఉద్దే

శింపబడిన వివాహమువలన గలుగు పెద్దకుమారునికి యావజ్జీవమును, అతని మరణానంతరము ఏ అనువాని రెండవ కుమారునికిని, బోవునట్లు ట్రస్టుసొత్తుగా ఏ అనువాడు తనసొంత ఆస్తిని బీ అనువానికి పరివర్తన చేయును. ఆలాగు జ్యేష్ఠపుత్రునిపక్షము కలుగ జేయబడిన హక్కు సిద్ధింపదు; ఏలయన ఏ అనువానికి ఆస్తిలో మిగిలియున్న యావత్తుహక్కునకు అది వర్తింపదు.

శాశ్వత విషయమునకు విరోధముగ విధి.

౧౪. ఆస్తిపరివర్తనవల్ల కలుగుహక్కు ఆలాగు పరివర్తన చేసిన తేదికి జీవించియుండు ఒకని యొక్కగాని లేక యెక్కువమంది యొక్కగాని జీవితానంతరమునను ఆకాలము గడిచినమీదట జీవించియుండు ఏ ఈడురాని మనుష్యునకు యుక్తవయస్సు వచ్చునెడల ఆలాగు కలుగచేయబడిన హక్కు చేరవలయునో ఆమనుష్యునియొక్క మైనారిటీకి తర్వాతను చెల్లునట్లు ఉన్నపక్షమున, అట్టి హక్కు ఏ పరివర్తనవల్లను కలుగ చేయబడ నేరదు.

ఏ తరగతిలో కొందఱు ౧౩, ౧౪ సెక్షనులకులోబడియుందురో ఆతరగతివారికి పరివర్తనచేయుట.

౧౫. ఆస్తి పరివర్తనానంతరము, ఒకానొక తరగతిలో చేరియుండు మనుష్యుల లాభముకొఱకు సదరు ఆస్తిపై హక్కు పుట్టియుండి ౧౩, ౧౪ సెక్షనులలో ఉండెడు ఏవయిన విధుల హేతువు మూలముగా సదరుహక్కు ఆ తరగతి వారిలో కొందఱి విషయములో తప్పిపోవునెడల, అట్టి హక్కు ఆ యావత్తు తరగతివారి విషయములోను తప్పిపోవును.

ముందఱి పరివర్తన తప్పిపోయినమీదట పరివర్తన చెల్లవలయునది.

౧౬. ౧౩, ౧౪, ౧౫ సెక్షనులలో చెప్పబడియున్న ఏ పద్ధతుల నిమిత్తమునన యినను హక్కు తప్పిపోవునెడల, ఆ వ్యవహారమందే కలగచేయబడి, సదరు మొదటిహక్కు తప్పిపోయినతర్వాతగాని లేక తప్పిపోయినందు వలనగాని సిద్ధించులాగు ఉద్దేశింపబడిన హక్కుకూడ తప్పిపోవును.



జనుల లాభము కొఱకు శాశ్వత పరివర్తన.

౧౭. మతము, విద్య, వర్తకము, ఆరోగ్యము, క్షేమము, లేక సర్వజన లాభకారియగు యితరవిషయమేదియయినను, వీని అభివృద్ధి కొరకు జనోపయోగమునకయి పరివర్తన చేయబడు ఆస్తివిషయములో ౧౪, ౧౫, ౧౬ సెక్షనులలోని నిర్బంధములు వర్తింపవు.

సంచయమునకు విధి.

౧౮. ఆస్తిలోనుండివచ్చు రాబడి చేర్చబడి ఉండవలయునట్లు అంజలి షరతులో విధింపబడి ఉండునెడల అట్టి విధి చెల్లదు; మఱియు చేర్చియుంచుటకు ఉత్తరువుచేయకుండిన ఏ ప్రకారమో ఆప్రకారమే ఆయాస్తి పరిష్కరింపబడవలయును.

మినహాయింపు.—ఆస్తిస్థిరాస్తిగానున్నపక్షమందుగాని లేక పరివర్తన తేదిమొదలుకొని చేర్చబడియుండునట్లు ఉత్తరవు చేయబడిన పక్షమందుగాని, ఆ తేది మొదలుకొని ఒక సంవత్సరమునకు లోపుగా ఆయాస్తినుండి వచ్చు రాబడినిగుఱించి మాత్రము ఆయుత్తరువు చెల్లుబడి కావలయును. ఆసంవత్సరాంతమందు చేర్చబడులాగు యుత్తరవుచేయబడ్డ కాలము గతించిపోయియుండిన ఏలాగో ఆలాగే అట్టి ఆస్తియు రాబడియు పరిష్కరింపబడవలయును.

సిద్ధించిన బాధ్యత.

౧౯. ఆస్తిపరివర్తనానంతరము,హక్కు ప్రాప్తింపవలయు కాలము నిర్దేశింపబడకుండ అయినను ఆ తక్షణముగాని సంభవింపవలయు కార్యము సంభవించినమీదటగాని అదిప్రాప్తింపవలయునను షరతు నిర్దేశింపబడి అయినను ఒకనిపరముగా అందుల హక్కు కలుగచేయబడు నెడల, పరివర్తన షరతులను బట్టి చూడగ విరుద్ధమగు ఉద్దేశము కనబడిననేతప్ప, అట్టిహక్కు ప్రాప్తించినది అగుచున్నది.

పరివర్తనకయికొనినవాడు స్వాధీన పరుచుకొనకముందు చనిపోయినను ప్రాప్తించిన హక్కునకు హానికలుగనేరదు.

వివరణము.—హక్కు యొక్క అనుభవము దేనివలన ఆపబడుచున్నదో లేక సదరు ఆస్తిపయిని ప్రథమహక్కు ఎవనికో మఱియొకనికి దేనివలన ప్రాప్తించుచున్నదో లేక ఆపబడుచున్నదో లేక అనుభవించు కాలము వచ్చువఱకు సదరు ఆస్తివలన వచ్చురాబడి చేర్పబడి ఉండునట్లు దేనివల్ల ఉత్తరువు చేయబడుచున్నదో అట్టి నిబంధనవల్ల మాత్రమయినను, పలాని కార్యము జరుగునెడల హక్కు మఱియొకనికి చెందవలసినదనెడు నిబంధనవల్ల మాత్రమయినను, సదరు హక్కు ప్రాప్తింపనేరదను ఉద్దేశము ఊహింపబడగూడదు.

పరివర్తన చేసిన మీదట అదివరకు పుట్టియుండనివానిలాభము కొరకు సిద్ధింపచేయబడిన బాధ్యతను అతడు ఎప్పుడు పొందునది.

౨౦. ఆస్తి పరివర్తనానంతరము అదివఱకు పుట్టియుండని వానిలాభము కొరకు అందు హక్కు కలుగచేయబడునెడల, ఆ పరివర్తన నిబంధనలను బట్టి చూడగ విరుద్ధమయిన ఉద్దేశము కనబడిననే తప్ప, అతడు పుట్టిన తత్క్షణము దానిని అనుభవించుటకు అతనికి హక్కు లేకున్నను ప్రాప్తమయిన హక్కును అతడు పుట్టిన తర్వాత పొందుచున్నాడు.

సందిగ్ధ బాధ్యత.

౨౧. ఆస్తి పరివర్తనానంతరము, నిర్దిష్టానిశ్చయకార్యము సంభవమయిననేగాని లేక అనిర్దిష్టానిశ్చయ కార్యము సంభవింపకుండినను, సిద్ధించునట్లు ఒకమనుష్యునకు ఆయాస్తిపయిహక్కు కల్పింపబడినప్పుడు, అట్టి మనుష్యుడు, అందువలన ఆ యాస్తిపయిన సందిగ్ధమగు హక్కును పొందుచున్నాడు. సదరు హక్కు అనిర్దిష్టానిశ్చయకార్యము సంభవమయిన ప్రథమపక్షమున ప్రాప్తమగు హక్కు అగుచున్నది. అనిర్దిష్టానిశ్చయ కార్యము సంభవిం[illegible] రెండవపక్షమున సదరు హక్కు సాధ్యముకానిదగుచున్నది.

మినహాయింపు:—ఆస్తి పరివర్తననుపట్టి నిర్దిష్టమగు వయస్సువచ్చిన మీదట సదరు ఆస్తిపయిని హక్కునకు బాధ్యత ఒకనికి కలిగి సదరు వయ



స్సు రాకముందు అట్టి హక్కువలన రాబోవు వచ్చుబడిని పరివర్తనచేయువాడు అతనికి పూర్ణముగా ఇచ్చునెడలగాని లేక సదరు ఆస్తిలోని రాబడినేని లేక అందులోని ఆవశ్యకమగునంత భాగమునేని అతనికిగాను ఉపయోగపడునట్లు ఉత్తరువు ఇచ్చునెడలగాని అట్టి హక్కు సందిగ్ధమైనది కాదు.

నిర్దిష్ట వయస్సు వచ్చిన వారి తరగతిలో చేరినవారికి పరివర్తన.

౨౨. ఆస్తిపరివర్తనానంతరము, నిర్దిష్టవయస్సువచ్చిన తెగవారితో చేరినవారికి మాత్రము ఆ యాస్తిపయిని హక్కు కలుగజేయబడునెడల, అట్టి హక్కు వయస్సురాని తెగవారిలో జేరిన యెవనికిని ప్రాప్తింపదు.

నిర్దిష్ట అనిశ్చయ కార్య సంభవము ననుసరించి పరివర్తన సందిగ్ధముగా నుండుట.

౨౩. ఆస్తి పరివర్తనానంతరము, నిర్దిష్టానిశ్చయకార్యము సంభవించునెడల, సదరు ఆస్తిపయిని హక్కు నిర్దిష్టమనుష్యునకు ప్రాప్తించునట్లు ఉండి, సదరు కార్యము జరుగుటకు కాలము ఉదాహరింపబడని పక్షమందు, మధ్యహక్కుగాని పూర్వపుహక్కుగాని ప్రాప్తింపక నిలిచిపోవుటకు పూర్వము అయినను నిలిచిపోవు కాలమందయినను అట్టి కార్యము జరిగిననేతప్ప ఆ హక్కు తప్పిపోవుచున్నది.

నిర్దిష్టము కానట్టి ఏదో ఒకకాలమందు మిగిలి జీవించియున్న కొందఱికి పరివర్తనచేయుట.

౨౪. ఆస్తి పరివర్తనానంతరము, ఏదో ఒక కాలమందు సజీవులయి మిగిలియున్న కొందఱికి ఆ యాస్తిపైని హక్కు ప్రాప్తింపవలయునట్లుండియు సరియైన కాలము నిర్దిష్టము కాని యెడల, పరివర్తనయొక్క షరతులందు విరుద్ధమగు ఉద్దేశము అగుపడిననే తప్ప, మధ్యహక్కుగాని పూర్వపుహక్కుగాని కలుగకుండ నిలువనున్నపుడు, వారిలో బ్రతికియున్న వారికి ఆ హక్కు చెందవలయును.

దృష్టాంతము.

ఎ అనువాడు, జీవితపర్యంతము బి అనువానికి, వాని మరణానంతరము సి - డి అనువారు సమముగా పంచుకొనునట్లుగాని లేక వారిలో అప్పటికి సజీవుడై మిగిలియుండువానికి చెందునట్లుగాని, ఆ స్తిని పరివర్తన చేయును. బి అనువాడు బ్రతికియుండగనే సి అనువాడు మరణము నొందును. డి అనువాడు బి యొక్క మరణానంతరము బ్రతికియుండును. బి అనువాడు మరణము నొందగనే ఆ యాస్తి డి అనువానిపరమగును.

షరతుబద్ధక పరివర్తన.

౨౫. ఆస్తి పరివర్తనానంతరము ప్రాప్తించి ఒక షరతును అనుసరించి ఉన్న హక్కు ఆ షరతును కొనసాగించుట అసాధ్యమయినను, చట్టమువలన నిషేధింపబడినను, ఆలాగు కొనసాగనిచ్చునెడల ఏ చట్టము యొక్క నిబంధనలకయిన భంగము కలిగించు స్వభావము కలదయినను, కృత్రిమమైనదయినను, ఇతరునికిగాని అతని ఆస్తికిగాని హానికలిగించినను, లేక హాని కలుగునట్లు తాత్పర్యమిచ్చినను, లేక కోర్టువారు దానిని అధర్మమనికాని జనుల కార్యనిర్వాహకపద్ధతికి విరోధించునని కాని ఎంచినను, అది తప్పిపోవును.

దృష్టాంతములు.

(ఎ) ఒక గంటసేపులో బి అనువాడు వందమయిళ్లు నడువవలయునను షరతుమీద, ఎ అనువాడు అతనికి ఒకపొలమును గుత్తకు ఇచ్చును. ఆ గుత్త చెల్లదు.

(బి) బి అనువాడు, ఎ అనువాని కొమార్తె అయిన సి అనుదానిని వివాహము చేసికొనవలయునను షరతుమీద, సదరు ఎ అనువాడు అతనికి ౫౦౦ రూపాయలు ఇచ్చును. పరివర్తనతేదికి సి అనునది చచ్చును. ఆ పరివర్తన చెల్లదు.

(సి) బి అను ఆమె సి ని చంపవలయునను షరతుమీద ఎ అనువాడు ఆమెకు ౫౦౦ రూపాయలు పరివర్తనచేయును. ఆ పరివర్తన చెల్లదు.

(డి) ఎ అనువాని మేనకోడలు అయిన సి అను ఆమె తన భర్తను వదలిపెట్టినయెడల, ఆమెకు ఎ అనువాడు ౫౦౦రూపాయలు పరివర్తనచేయును. ఆ పరివర్తన చెల్లదు.



పూర్వ షరతును నెఱవేర్చుట.

౨౬. ఆస్తి పరివర్తన నిబంధనలలో ఒకషరతు ఆయాస్తిపైని హక్కును పొందుటకు పూర్వము హక్కును పొందువాని వలన నెఱవేర్పబడవలయునని విధించునెడల, షరతుప్రకారము వాస్తవముగా జరిగియుండినయెడల, ఆ షరతు నెఱవేర్పబడ్డట్టు తలంపబడవలయును.

దృష్టాంతములు.

(ఎ) సి - డి - ఇ అనువారి అనుమతిమీద బి అనువాడు వివాహముచేసికొనవలయునను షరతుతో ఎ అనువాడు అతనికి ౫,౦౦౦ రూపాయలు పరివర్తనచేయును. ఇ అనువాడు చనిపోవును. బి అనువాడు సి-డి అనువారి అనుమతిమీద వివాహముచేసికొనును. బి అనువాడు ఆషరతుప్రకారము నెఱవేర్చినట్లు గ్రహింపబడును.

(బి) సి - డి - ఇ అనువారి అనుమతిమీద బి అనువాడు వివాహము చేసికొనవలయునను షరతుపైన ఎ అనువాడు అతనికి ౫,౦౦౦ రూపాయలు పరివర్తనచేయును. బి అనువాడు సి - డి - ఇ అనువారి అనుమతి లేకుండ వివాహము చేసికొని తరువాత వారి అనుమతిని పొందును. బి అనువాడు షరతును నెఱవేర్చినవాడు అగును.

ఒకనికి చేయబడ్డ పరివర్తన అదితప్పినయెడల మరియొకనికి పరివర్తన కావలయును అనుషరతుబద్ధకమైన పరివర్తనగా ఉండుట.

౨౭. ఆస్తి పరివర్తనానంతరము, ఒక మనుష్యుని పక్షముగా సదరు ఆస్తిపైన హక్కు కలుగచేయబడి ఆపరివర్తనవల్ల మొదటి ఏర్పాటు తప్పిపోవు పక్షమందు, ఆవ్యవహారమును అనుసరించియే, మరియొకని పక్షముగా ఆహక్కును గురించియే తర్వాత ఏర్పాటు చేయబడునెడల, పరివర్తనచేసినవాని వల్ల తలంపబడ్డ ప్రకారము మొదటి ఏర్పాటు తప్పిపోకపోయినను సదరు మొదటి ఏర్పాటు తప్పిపోయినమీదట తర్వాత ఏర్పాటు చెల్లవలయును.

కాని తర్వాత చేసికొనబడిన ఏర్పాటు ప్రథమమందు చేసికొనబడిన ఏర్పాటు నిర్దిష్టవిధముగా తప్పిపోయిన విషయములో చెల్లవలయునని, ఆ వ్యవహారమునందు ప్రవేశించియున్న కక్షిదారుల అభిప్రాయమైయున్నట్లు

డు, ఆనిర్దిష్టవిధముగా ప్రథమమందు చేసికొనబడిన ఏర్పాటుతప్పిపోయిన నేతప్ప, తర్వాత యేర్పాటు చెల్లగూడదు.

దృష్టాంతములు.

(ఎ) ఎ అనువాడు చనిపోయిన మూడు మాసములకు లోగా బి అనువాడు ఒకానొక కవులువ్రాసి ఇయ్యవలయునను షరతుమీద బి అను వానికి చెల్లునట్లును అతడు ఆలాగు వ్రాసి ఇయ్యక అశ్రద్ధచేయు నెడల సి అనువానికి చెల్లునట్లును, ఎ అనువాడు బి - అనువానికి ౫౦౦ రూపాయలను పరివర్తనచేయును. ఎ అనువాడు జీవించి ఉండగనే బి అనువాడు చనిపోవును. సి అనువాని పక్షమునచేసిన ఏర్పాటు చెల్లుచున్నది.

(బి) ఎ అనువాడు ఆస్తిని తనభార్యకు పరివర్తన చేయును; కాని అతనిజీవితకాలమందు ఆమె చనిపోవు పక్షమందు ఆమెకు పరివర్తన చేసినదానిని బి అనువానికి పరివర్తన చేయును. ఏ అనువాడును అతని భార్యయు ఏకకాలమందే చనిపోవుదురు, కాని ఆతనికిపూర్వమందు ఆమెచనిపోయినదని ఋజువుపఱుచుట అసాధ్యమైయుండును. బి అనువానిపక్షమున చేసిన ఏర్పాటుచెల్లదు.

నిర్దిష్ట కార్యము జరిగినపుడుగాని జరుగక పోయినమీదట గాని సిద్ధించునట్టి తర్వాతి పరివర్తన.

౨౮. ఆస్తిపరివర్తనానంతరము,నిర్దిష్టానిశ్చయకార్యము జరుగునెడల ఆయాస్తిపై హక్కు మఱియొకనికి చెందవలయుననికాని, లేకనిర్దిష్టానిశ్చయ కార్యముజరుగని ఎడల అట్టిహక్కు మఱియొకనికి చెందవలయునను షరతును చేర్చికాని ఏమనుష్యునకయిన చెందునట్లు అట్టిహక్కు కలుగజేయ బడవచ్చును. ప్రతివిషయములోను సదరు ఏర్పాటులు ౧౦, ౧౨, ౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౫, ౨౭ సెక్షనులలోని విధులకులోనై వుండును.

తర్వాతిషరతును నెఱవేర్చుట.

౨౯. పైనవచ్చిన సెక్షనులవల్ల తెలియజేయబడినట్టి వుత్తరకాలపు ఏర్పాటు ఆ షరతు సంపూర్ణముగా కొనసాగిననేతప్ప చెల్లుబడికాజాలదు.



దృష్టాంతము.

బి అనువాడు మైనరుగా ఉండి చనిపోయినను లేక సి అనువాని అనుమతి లేక వివాహమాడినను ౫౦౦ రూపాయలు డి అనువానికి చెందవలయునను నిబంధనచేసి బి అనువాడు యుక్తవయస్సుకు వచ్చినతోడనే, లేదా వివాహమాడినతోడనే, వానికి చెల్లించునట్లు సదరు ౫౦౦ రూపాయలు ఎ అనువాడు ఆతనికిపరివర్తనచేయును. సి అనువాని అనుమతిలేకయే బి అనువాడు తాను ౧౭ సంవత్సరముల ఈడుగనున్నప్పుడే వివాహమాడును. డి అనువాని పేరచేసిన పరివర్తనచెల్లును.

తర్వాతియేర్పాటుయొక్క దౌర్బల్యమువల్ల ముందటియేర్పాటునకు బాధకము లేకుండుట.

౩౦. తర్వాతి ఏర్పాటుచెల్లుబడికానిది అయిన పక్షమున ముందటి ఏర్పాటునకు అందువలన బాధకము కలుగదు.

దృష్టాంతము.

బి అను ఆమె జీవించియుండువఱకు ఎ అనువాడు ఒక పొలమును ఆమెకును, ఆమెతనభర్తను వదలిపెట్టనియెడల సి అనువానికి పరివర్తనచేయును. వఱకుతేకుండిన ఏలాగో ఆలాగే బి అను ఆమె జీవించియుండువఱకు ఆమెకు సదరు పొలముమీద హక్కు ఉండును.

నిర్దిష్ట అనిశ్చయకార్యముజరిగినను లేక జరుగకపోయినను పరివర్తన సఫలముకాకుండ నిలిచి పోవలయునను షరతు.

౩౧. ౧౨వ సెక్షనుయొక్క నిబంధనలకు లోబడి ఆస్తి పరివర్తనచేసిన మీదట, సదరు ఆస్తిపైని హక్కు కలుగజేయబడిదానితోగూడ నిర్దిష్టానిశ్చయకార్యము జరిగినను జరుగకున్నను, సదరు హక్కులేకుండ నిలిచిపోవలయునను షరతు చేర్చబడవచ్చును.

దృష్టాంతములు.

(ఎ) బి అనువాడు ఒకానొక అడవి కొట్టుపక్షమందు పరివర్తనచెల్లకుండనిలిచిపోవలయునను నిబంధనను చేర్చి అతని జీవితపర్యంతము ఒక పొలమును ఎ అనువాడు అతనికి పరివర్తనచేయును. బి అనువాడు అడవిని కొట్టును. పొలములో జీవితపర్యంతము అతనికి ఉన్న హక్కును పోగొట్టుకొనును.

(బి) బి అనువానికి ఎ అనువాడు ఒక పొలమును పరివర్తనచేసి సదరు పరివర్తనచేసిన మూడు సంవత్సరములలోపల బి అనువాడు ఇంగ్లాండుకు వెళ్లనియెడల ఆపొలములో అతనికిగల హక్కు నిలిచిపోవలయునని అందు నిబంధనచేయును. నిర్దిష్టకాలమునకు లోపల బి అనువాడు ఇంగ్లాండుకు వెళ్లడు. సదరు పొలములో అతనికిగల హక్కు నిలిచి పోవును.

అట్టి షరతు నిష్ఫలము కాకూడదు.

౩౨. హక్కులేకుండ నిలిచి పోవలయునను నిబంధన చెల్లుకొనుటకు దానికి సంబంధించిన సంగతి చట్టప్రకారము హక్కును కలుగజేయునట్టి నిబంధనగ ఉండుట ఆవశ్యకమైయున్నది.

కార్యమును నెరవేర్చుటకు కాలము నిర్ణయింప బడనపుడు ఆకార్యమును నెరవేర్చిన మీదట సిద్ధించునట్టి పరివర్తన.

౩౩. ఆస్తి పరివర్తనానంతరము హక్కునుపొందిన మనుష్యుడు ఏదో ఒక కార్యమును జేయవలయునను షరతుతో హక్కునుపొంది సదరుకార్యము ఎప్పుడుచేయవలయునను దానికి కాలము నిర్ణయింప బడనప్పుడు శాశ్వతముగా గాని లేక నిర్వహణాశక్యమగునంత కాలముదాకగాని అట్టి కార్యమును చేయుటవాడు అసాధ్యముగా జేసినచో సదరుషరతు భంగపఱుపబడును.

కాలము నిర్ణయింపబడినపుడు కార్యము నెఱవేర్చినమీదట సిద్ధించునట్టి పరివర్తన.

౩౪. ఆస్తి పరివర్తనానంతరము పొందబడిన హక్కు ఒక మనుష్యునివలన పొందబడుటకు పూర్వము నెఱవేర్పవలయు షరతుగానయినను దానిని నెఱవేర్పక పోయినందువలన సదరు హక్కు అతనివద్దనుండి మఱియొకనికిబోవు షరతుగా నయినను, అతనివలన ఒకకార్యము జరుపబడవలసియుండి షరతుప్రకారము నెఱవేఱనందుచేత స్వయముగా లాభము పొందునట్టి ఒక మనుష్యునియొక్క కుట్రవల్ల నిర్దిష్టకాలమునకు లోపుగా ఆలాగు నెఱవేర్చుటకు అడ్డుకలుగుపట్ల, ఆకార్యము నెఱవేర్చునిమిత్తము ఒకకాలమును ఏర్పఱచుసంగతిలో ఆకార్యమును నెఱవేర్చునిమిత్తము అట్టికుట్రవలన గ



లుగజేయబడిన అడ్డును తొలగించి సరిపుచ్చుటకు వానికి పైపోటగ కావలయునంత ఎక్కువకాలము ఇయ్యబడవలయును. కాని సదరు కార్యము నెఱవేర్చుటకు కాలము నిర్దేశింపబడనియెడల అప్పుడు షరతుప్రకారము నెఱవేఱక పోవుటవలన లాభముపొందువాని కుట్రవల్ల దానిని నెఱవేర్చుట అసాధ్యముగా జేయబడినను లేక చిరకాలముదాక ఆపబడినను అతనికి పైపోటిగ సదరు షరతుప్రకారము నెఱవేర్పబడ్డట్లు ఎన్నబడ వలయును.

కోరుకొనుట.

కోరుకొనుటయెప్పుడావశ్యకము.

౩౫. తనకు పరివర్తన హక్కులేని ఆస్తిని పరివర్తన చేయునట్లుగా చెప్పి ఆ వ్యవహారమందు ఒక భాగముగా సదరు ఆస్తియొక్క యజమానునికి ఏదయిన ప్రయోజనము కలుగజేసినపుడు, సదరు పరివర్తనను స్థాపించుటకుగాని లేక త్రోసివేయుటకుగాని సదరు యజమానుడు కోరుకోవలయును. మఱియు ఆప్రయోజనము త్రోసివేయబడు రెండవపక్షమున సదరు యజమానుడు ఆప్రకారము ఇయ్యబడిన ప్రయోజనమును వాడు పోగొట్టుకొనవలయును. అట్లుపోగొట్టుకొనిన ప్రయోజనము పరివర్తనకర్తకుగాని వాని ప్రతినిధికిగాని పరిహరింప బడనట్టేపోయి చేరవలయును,

అయినప్పటికి,

పరివర్తన ఉచితముగాజేయబడి పరివర్తనకర్త కోరుకొనుటకు పూర్వము చనిపోయిగాని లేక ఏ యితర విధముగానయిన క్రొత్తగ పరివర్తనచేయుటకు అశక్తుడై ఉండినవిషయములోగాని,

మఱియు ప్రతి ఫలమునకుగాను పరివర్తనచేయు అన్ని విషయములలోను,

ఆశాభంగమును పొందిన పరివర్తనస్వీకర్త కోరునవానికి పరివర్తనచేయనెంచిన ఆస్తియొక్క కిమ్మతుకాని మొత్తముకాని ఇచ్చి సరిపెట్టవలయు జవాబుదారీకి లోబడి ఉండవలయును.

## దృష్టాంతములు.

సుల్తానుపూరు అను గుత్తనేల (ఫారమ్) ౨౦౦ రూపాయల ఖరీదుగల సి అనువానియొక్క ఆస్తి అయియున్నది. ఎ అనువాడు బి అనువాని పేరట దాన పత్రమువలన దానిని పరివర్తనచేయునట్లుచెప్పి ఆ పత్రము మూలముగానే సి అనువానికి ౧,౦౦౦ రూపాయలు ఇచ్చును. సి అనువాడు సదరు గుత్తనేలను నిలుపుకొనుటకు కోరుకొనుచున్నాడు. సదరు ౧,౦౦౦ రూపాయలదానమును అతడుపోగొట్టుకొనును.

అట్టివిషయములోనై ఎ అనువాడు కోరుకొనుటకుముందే చనిపోవును. వాని ప్రతినిధి సదరు ౧,౦౦౦ రూపాయలలో ౨౦౦ రూపాయలు బి అనువానికి చెల్లింపవలయును.

ఈ సెక్షనుయొక్క మొదటి పేరాలో నుండువిధి పరివర్తనకర్త తాను పరివర్తన చేయుదునని చెప్పునది తన సొంతమని నమ్మినను నమ్మకున్నను చెల్లును.

ఒక వ్యవహారమును అనుసరించి తాను స్వయముగ లాభమును చేకొనక సదరు లాభమును అప్రత్యక్షముగ గయికొను మనుష్యుడు కోరుకోనక్కఱలేదు.

ఒక మనుష్యుడు తనయొక్క ఒక బాధ్యతను అనుసరించి ఒక ప్రయోజనమును పొంది మఱియొక బాధ్యతను అనుసరించి దానిని వదలుకొనును.

పయినినాలుగువిధులకు మినహాయింపు. — పరివర్తనకర్త పరివర్తన చేయుదునను ఆస్తియొక్క యజమానునికి ఒక నిర్దిష్టప్రయోజనము కలుగజేయునట్లు చెప్పబడియున్నప్పుడును సదరు ప్రయోజనము ఆస్తికిబదులుగ ఉన్నట్లు చెప్పబడినను, అట్టి యజమానుడు సదరు ఆస్తిపైని దావాను చూపినయెడల, సదరు ప్రయోజనమును వాడు వదలుకొనవలయును, కాని ఆ వ్యవహారము వలననే కలిగిన ఇతర ప్రయోజనమును వదలుకొనుటకు వాడు బద్ధుడుకాడు.

ప్రయోజనమును గ్రహించువాడు తాను వరించుట విధాయకమును అనియు, హేతుజ్ఞానము కలమనుష్యుని వరించుటకు పురికొలుపునట్టి స్థితిగ



తులను, వానికి తెలిసియున్నను, లేకవాడు అట్టి స్థితిగతులను విచారించక త్యజించినను, ప్రయోజనమును పొందినమనుష్యుడు సదరు ప్రయోజనమును గ్రహించుట - పరివర్తనను స్థాపించుటకు కోరుకొనుటను ఏర్పఱుచును.

అట్టి ఎఱుకగాని ఎఱుగ మానుకొనుటగాని, అందునకు వ్యతిరిక్తముగ రుజువులేనప్పుడు తనకు సమాధానము లేనట్లు తెలియజెప్పు కార్యమును దేనినిజేయక రెండు సంవత్సరములు ఎవనికి ప్రయోజనము కలుగజేయబడినదో వాడు అనుభవించుచుండిన యెడల అట్టి ప్రయోజనము కలిగినట్లు భావింపబడవలయును.

పరివర్తనచేయబడులాగుచెప్పబడ్డ ఆస్తిలో హక్కుగల మనుష్యులను, అతడు ఏకార్యమునయినను చేయకుండ నుండినచో ఏస్థితిలో నుంచవచ్చునో ఆస్థితిలో ఆకార్యమును చేసియుండుటను గురించి వారిని ఉంచగూడని పక్షమందు, అతడు ఆలాగు ఎఱిగియుండుటనుగాని మానుకొనుటనుగాని యూహింపవచ్చును.

## దృష్టాంతము.

ఎ అనువాడు సి అనువానికి హక్కుగల ఒక ఎస్టేటును బి అనువానికి పరివర్తన చేయును; అట్లుచేసి సదరు వ్యవహారములోని భాగముగానే రక్కసిబొగ్గుగనిని సి అనువానికిచ్చును. సి అనువాడు సదరుగనిని స్వాధీనపఱుచుకొని అందులోనిబొగ్గును యావత్తు వ్రయముచేయును. అందు మూలముగ వాడు బి అనువాని పరము పరివర్తనచేయబడిన ఎస్టేటుయొక్క పరివర్తనను స్థిరపఱుచును.

పరివర్తనను స్థిరపఱుచుటకుగాని త్రోసివేయుటకుగాని తనకుగల అభిప్రాయమును పరివర్తనకర్తకుగాని వాని ప్రతినిధులకుగాని పరివర్తనతేదికి ఒక సంవత్సరము లోపుగ సూచనగ తెలియజేయని యెడల, పరివర్తనకర్తగాని వాని ప్రతినిధులుగాని సదరు కాలముగడచినతోడనే అతనిని కోరుకోమని కోరవచ్చును. మఱియు అతడు అట్లు కోరినతర్వాత తగి

నంతకాలము లోపుగ సదరు కోరికను ఫలింప జేయని యెడల పరివర్తనను స్థాపించుటకు కోరుకొనినట్లే ఎన్నబడును.

అశక్తతవిషయములో సదరు అశక్తత తగ్గిపోవు నంతదాకగాని లేక తగిన అధికారినియామకము చేయునంతదాకగాని కోరుకొనుట అపబడవలయును.

పంచిపెట్టుట.

హక్కు కలవాని కున్న బాధ్యత నిలిచిపోయినమీద ఈ పయికమునువాయిదాల ప్రకారము పంచిపెట్టుట.

౩౬. వ్యతిరేక భావమునిచ్చు కరారుగాని ప్రదేశాచారముగాని లేనప్పుడు అద్దెలు,వర్షాశనములు, పింఛనులు, పంచి వేతలు, రాబడిలో చేరునట్టి వాయిదాల ప్రకారము చెల్లింపబడు పయికము అట్టి చెల్లుపయికమును వసూలుచేయుట కధికారముగల వాని యొక్క హక్కు పరివర్తన అయిపోయినమీదట పరివర్తన కర్తయొక్కయు పరివర్తనకైకొను వాని యొక్కయు వ్యవహారమందువలెనే నానాటికి బాకిపడి తదనుసారముగ పంచిపెట్టదగియున్నట్లు తలంపబడవలయును. కాని అవి అన్నియు చెల్లింపబడుటకు నిర్ణయింపబడిన దినములందే చెల్లింపబడవలయునట్లు తలంప బడవలయును.

(ఆస్తి) పంచినమీదట పూచీకి సంబంధించినలాభమును పంచి పెట్టుట.

౩౭. పరివర్తనకు ఫలముగ ఆస్తి అనేక భాగములుగ విభజింపబడి అనంతరము ఆధీనములో ఉండి అందు మీద ఆస్తిసంబంధమగు జవాబుదారీయొక్క ప్రయోజనము సర్వము ఒకనినుండి అనేకులకు స్వామ్యమయిపోవు సంగతిలో సదరు యజమానులలో విరుద్ధభావమును సూచించు కరారు లేనప్పుడు దానికి సరియగువిధి ఆస్తిలో భాగస్వామి భాగముయొక్క కిమ్మతును అనుసరించి సదరు ఆస్తిభాగస్వాములలో ప్రతివానిపరముగ జరుపబడవలయును. కాని సదరు విధి ప్రత్యేకముగ పంచిపెట్టగూడినదిగను అట్లుపంచుటవలన జవాబుదారీయొక్క భారమును వాస్తవముగా ఎక్కువచేయునదిగాను ఉండగూడదు, అయినను



జవాబుదారీ ప్రత్యేకముగ పంచిపెట్టగూడక పోయిననుగాని లేక అట్లు పంచుటవలన జవాబుదారీయొక్క భారము వాస్తవముగ ఎక్కువఅగునెడలగాని ఆయాభాగస్వాములు ఉమ్మడిగ నియమించుకొను వారిలో ఒకని యొక్క ప్రయోజనము కొఱకు జవాబుదారీ నెఱవేర్పబడవలయును.

అయినను ఎవనియందు జవాబుదారీయొక్క భారము ఉన్నదో ఆమనుష్యునకు పంచిపెట్టిన సంగతిని గురించి న్యాయమయిన నోటీసు ఉండినసే గాని ఉండవలెనుగాని తప్ప ఈసెక్షనులో ఉదాహరింపబడి యున్నరీతిని నెఱవేర్పకుండ తప్పిపోయినందులకు ఉత్తరవాది కాగూడదు.

ఈసెక్షనులో ఉండునది ఏదియు, ప్రదేశ గవర్నమెంటువారు సర్కారు గెజెటులో ప్రకటనద్వారా ఉత్తరువు చేసిన దప్పగాని చేయు నంతదాక గాని వ్యవసాయపుపనులకొఱకు గైకొనుకవులు సంగతులందు వర్తింపదు.

దృష్టాంతములు.

(ఎ) ఎ అనువాడు ఒక గ్రామమందున్నట్టియు ఇ అనువానికి సంవత్సరమునకు రు ౩౦ ల అద్దె చొప్పునను ఒక నందిబలిసిన గొఱ్ఱెను విడిపించుటనుబట్టియు ఇయ్యబడినట్టియు ఒక ఇంటిని, బి - సి - డి అనువానికి అమ్మెను. బి అనువాడు క్రయధనములో సగపాలును సి - డి అనువారు ఒక్కొక్కరు పాతికె పాలును ఇచ్చిరి. ఇ అనువాడు ఈ విషయమును గురించి నోటీసు నుపొంది బి అనువానికి రు ౧౫ లు సి అనువానికి రు ౭ - ౮ - ౦ లు డి అనువానికి రు ౭ - ౮ - ౦ లు ఇచ్చి బి - సి - డి అనువారల ఉమ్మడి ఉత్తరువు ప్రకారము సదరు గొఱ్ఱెను విడిపించి ఇయ్యవలయును.

(బి) ఆసంగతిలోనే ఆగ్రామములోని ప్రతికుటుంబమువారును నీటివరదను ఆపుటకు కట్టను కట్టునిమిత్తము ప్రతి సంవత్సరము పదిదినముల కష్టము చేయుటకు బద్ధులై ఉన్నందువలన ఇ అనువాడు తనకవులులోని నిబంధనను గొనసాగింప ఎ అనువానికి బదులుగ సదరుపనినిచేయుటకు ఒప్పుకొనెను. బి - సి - డి అనువారు తమ బదులుకై బాకీపడిన ఇ అనువానిని సదరు పదిరోజుల కష్టమును ప్రత్యేకముగ వానికి బదులుగ చేయుమని కోరిరి. బి - సి - డి అనువారలు ఉమ్మడిగ ఇచ్చు ఉత్తరువులను అనుసరించి ఇ అనువాడు అంతయు కలిపి పదిదినముల కష్టము కంటె ఎక్కువ చేయుటకు బద్ధుడుకాడు.

## (బి)—స్థిరాస్తి పరివర్తనను.

*కొన్ని సందర్భములను బట్టి మాత్రమె పరివర్తన చేయుటకు అధికారముపొందిన మనుష్యునివలన చేయబడు పరివర్తన.*

౩౮. స్థిరాస్తిని పరిష్కరించుటలో మాఱునట్టి స్వభావముకల సంగతులను అనుసరించి మాత్రము అధికారమును పొంది అట్టిసంగతులు ఉన్నట్లు చెప్పుచు ఒకమనుష్యుడు ప్రతిఫలముకొఱకు ఆస్తిని పరివర్తనచేయునపుడు, ఒకపక్షమున పరివర్తనకైకొను వానికిని రెండవ పక్షమున పరివర్తన కర్తకును పరివర్తన బాధ్యతకలిగిన ఇతరులు (ఎవరయిన ఉండిన)వారికిని గల వ్యవహారమువలెనే, పరివర్తనకైకొనువాడు అట్టిసంగతులను తగినంతజాగ్రతతో విచారించినతర్వాత నిష్కాపట్యముగా పనిచేసినయెడల, సదరుసంగతులు ఉండినట్లు తలంపబడవలయును.

### దృష్టాంతములు.

ఎ అను హిందూ వితంతువుయొక్క భర్త సమీప వారసుదారులను ఉంచి చనిపోయెను. ఆవితంతువు ఆప్రకారముగ తనస్వాధీనమందు ఉంచుకొనియున్న ఆస్తితన జీవనమునకును చాలినదికాదని చెప్పుచు సదరు ఆస్తిలోని భాగమయిన ఒకచేనును మతవిషయకములు, ధర్మార్థ విషయకములును, అగు కార్యములకు వినియోగింపక బి అనువానికి విక్రయించుటకు ఇష్టపడును. ఎ అను ఆమెయొక్క జీవనమునకు సదరు ఆస్తిపైన వచ్చురాబడి చాలకుండ ఉన్నదనియు సదరు చేనును విక్రయించుట ఆవశ్యకమనియు బి అనువాడు న్యాయమయిన విచారణవలన తెలిసికొని మంచితాత్పర్యముతో ఎ అనుదాని వద్దనుండి సదరు చేనును కొనును. ఒకవైపు బి అనువాని విషయములోను మఱియొకవైపు ఎ అను ఆమె సమీపవారసుల విషయములోను విక్రయమునకు ఆవశ్యకము ఉండినటుల గ్రహింపవలయును.

*మూడవమనిషి జీవనాంశమునకు హక్కు కలిగియున్నపుడు పరివర్తన.*

౩౯. స్థిరాస్తివలన గలుగు లాభములనుండి జీవనాంశము(భరణము) పొందుటకుగాని అభివృద్ధికొఱకయినను వివాహముకొఱకయినను ఏర్పాటు పొందుటకుగాని ఒక మూడవమనుష్యుడు హక్కుకలిగి సదరుహక్కు భంగపఱుపవలయుననుతాత్పర్యముతో



సదరు ఆస్తిని పరివర్తనచేయునపుడు, అట్టి తాత్పర్యమును గురించి పరివర్తనకైకొను వానికి నోటీసుచేసి యుండిన యెడలగాని లేక పరివర్తన ఉచితార్థమయినదిగ ఉండినయెడలగాని అతనిమీద హక్కును చలాయింపవచ్చును. కాని హక్కునుగుఱించి నోటీసులేకయే ప్రతిఫలము కొఱకు పరివర్తనచేయబడ్డ వానిమీదగాని అతని స్వాధీనమందేది ఉన్నదో అట్టి ఆస్తిమీదగాని అమలు చలాయింపగూడదు.

### దృష్టాంతము.

హిందువు అయిన ఎ అనువాడు ఒకడు తనవదినె అయిన బి అను ఆమెయొక్క మృతుడగు భర్తయొక్క ఆస్తిని పొందుటకు హక్కుకలిగి యున్నందువలన జీవనాంశముకొఱకు అతనిమీద ఆమెతెచ్చిన దావాసంబంధులు సుల్తానుపూరును ఆమెకు పరివర్తనచేసి సదరు సుల్తానుపూరు ఆమెస్వాధీనములో నుండి తప్పింపబడు యెడల ఆమెకోరే మనిషి స్వాధీనమందుడున్న నిర్దేశింపబడ్డ అయా ఇతర గ్రామములో గాని దానినుండి అందుకు సమమయిన భూమిని తాను ఆమెకుపరివర్తనచేయుదును అని ఆమెతో ఒడంబడికచేసికొనును. సదరు నిర్దిష్ట గ్రామములను ఎ అనువాడు సి అనువానికి విక్రయించును. సి అను అతడు సదరు ఒడంబడిక సంగతి ఎఱుకలేక ఎట్టి కృత్రిమభావము లేకుండ వానిని కొనును. సుల్తానుపూరు బి అను ఆమె స్వాధీనములోనుండి తప్పిపోవును. సి అను వానిపేరట పరివర్తన చేయబడిన గ్రామములపయి ఆమెకు దావా ఉండదు.

*భూమియొక్క యనుభవమునకు నిర్బంధపెట్టువుపాధీకారము.*

౪౦. స్వీయమగు తన స్థిరాస్తిని విశేష ప్రయోజనకరముగ అనుభవించుటకు, ఇతరుని స్థిరాస్తి హక్కుతోగాని లేక దాని అనుభోగ బాధ్యతతోగాని సంబంధములేకుండనే సదరు ఇతరుని స్థిరాస్తి అనుభవమును ఆటంకపఱచుటకుగాని లేక నిర్దిష్టవిధముగదానిని అనుభవింప బలాత్కారపఱచుటకుగాని మూడవమనుష్యునకు హక్కు కలిగియున్న సంగతిలోగాని, లేక

*లేక స్వామ్యముతో జత పఱుపబడి హక్కు గాగాని అనుభోగబాధ్యత గాగాని యేర్పడనట్టిపూచీభారము.*

కరారువలన గలిగి స్థిరాస్తి స్వామ్యముతో జేర్పబడునట్టియు దానిపయిని హక్కులోగాని అనుభోగ బాధ్యతలోగాని చేరనిపూచీయొక్క లాభమునకు ఒక మూడవమనుష్యుడు బాధ్యత కలిగియుండు సంగతిలోగాని, లేక సదరు హక్కు పూచీల సంగతిలో నోటీసుయిచ్చి పరివర్తనకైకొనిన వానిపయిన నయినను వాని కారణమున బాధకము పొందినట్టి ఉచితముగ పరివర్తన కయికొనినవానిపయిన నయినను సదరు హక్కు పూచీలు మోపబడవచ్చును; కాని ప్రతిఫలముకొఱకును సదరుహక్కు పూచీలనుగుఱించి నోటీసు ఇయ్యకనుకాని తనస్వాధీనములో ఏయాస్తియుండునో అట్టిఆస్తి పయిన నయిననుగాని సదరు హక్కు పూచీలు పరివర్తన కయికొనువాని పయిన బలాత్కారముగ మోపబడగూడదు.

దృష్టాంతము.

సుల్తానుపురమును అమ్ముటకు ఎ అనువాడు బి అనువానితో కరారుచేసికొనును. అట్టి కరారు అమలులో ఉండగనే సదరు కరారు విషయమై నోటీసుపొందిన సి అనువానికి అమ్మును. ఆకరారును ఎ అనువానిపయి ఎంతవఱకు బలాత్కారముగ మోపవచ్చునో సి అనువాని పయిన బి అనువాడు అంతవఱకు బలాత్కారముగ మోపవచ్చును.

౪౧. స్థిరాస్తిపైన హక్కుకల మనుష్యులవలన స్పష్టముగగాని సూచనగగాని అంగీకారమునుపొంది ఒక మనుష్యుడు సదరు ఆస్తిపయిన పేరునకు మాత్రము యజమానుడుగా నుండి ప్రతి ఫలము కొఱకు సదరు ఆస్తిని పరివర్తనచేయు పక్షమందు, పరివర్తనకర్త అట్లు పరివర్తనచేయుటకు అధికారమును పొందియుండలేదను కారణమున సదరుపరివర్తనరద్దు పఱుపదగియుండగూడదు. అయినను పరివర్తనకైకొనువాడు అట్లుపరివర్తనచేయుటకు పరివర్తనకర్త అధికారము కలవాడు అని తగినంతజాగ్రతతో విచారించిన తర్వాత న్యాయతాత్పర్యముతో వర్తింపవలయును.

*బహిరంగముయిన యజమానునివలన పరివర్తన.*

౪౨. పరివర్తనను రద్దుపఱుచుటకు అధికారమును ఉంచుకొని ఒకమనుష్యుడు ఏ స్థిరాస్తి నయినను పరివర్తనచేసి, తర్వాత ప్రతిఫలాపేక్షచేత ఇంకొక పరివర్తన కయికొనువానికి దానిని పరివర్తనచేయుపక్షమున, అట్టి పరివర్తన సదరు అధికారవ్యాప్తిని అనుసరించి ప్రథమ పరివర్తన రద్దు పఱుపబడి రెండవసారి పరివర్తన కయికొన్నవాని పక్షమున జేయబడినట్లు చెల్లుబడి అగును; (కాని అది సదరు అధికారముయొక్క చెలాయింపు షరతులకు దేనికయినను లోబడి ఉండవలయును).

*మొందటి పరివర్తనను త్రిప్పివేయుట కధికారము కల మనుష్యునివలన పరివర్తన.*

దృష్టాంతము.

ఎ అనువాడు బి అనువానికి ఒక ఇంటిని అద్దెకు ఇచ్చి బి అనువాడు సదరు ఇంటికి నష్టముకు భంగము కలుగునట్లు దానిని ఉపయోగించెనని ఒక సర్వేయరుగారు అభిప్రాయపడిన పక్షమున సదరు అద్దెచీటిని రద్దు పఱుచుటకు అధికారమును ఉంచుకొనును. తర్వాత ఇంటికినష్టముకు భంగము కలుగునట్లు బి అనువానివలన ఉపయోగింపఁబడుచుకొనబడినదని అనితలచి ఎ అనువాడు సదరు ఇంటిని సి అనువానికి అద్దెకుఇచ్చును. బి అనువాడు దానిని ఆధీనమందుంచుకొని ఉపయోగించుకొనుట దాని ఖరీదుకు భంగముకలుగజేయును అను సర్వేయరుగారి అభిప్రాయమునకులోనై బి అనువాని అద్దెచీటిని రద్దుచేయుటకు ఇది ఉపయోగపడును.

౪౩. ఒకమనుష్యుడు ఒకానొక స్థిరాస్తిని పరివర్తనచేయుటకు తనకు అధికారము ఉన్నదని పొరపాటునచెప్పి ప్రతిఫలాపేక్షచే అట్టి ఆస్తిని పరివర్తన చేయుపక్షమున, అట్టి పరివర్తన, పరివర్తనకయికొనువాని ఇష్టప్రకారము పరివర్తన కరారు ఉండు కాలములో ఎప్పుడైనను ఆయాస్తిపైన పరివర్తనకర్తపొందు హక్కుమీద చెల్లుబడి కావలయును.

*పరివర్తన చేయబడిన ఆస్తిపైన తర్వాత హక్కుపొందెడి అధికార రహితుడగువానివలన పరివర్తన.*

ఈ సెక్షనులో ఉండునది ఏదియు పైనచెప్పబడిన ప్రకారము ఇష్టము ఉన్నట్లు నోటీసులేకుండ ప్రతిఫలాపేక్షచేత న్యాయముగ పొందు పరివర్తన కయికొనువారి హక్కును బాధింపదు.

## దృష్టాంతము.

హిందువు అయిన ఎ అనువాడు బి అను తన తండ్రిలోనుండి విభాగమై ఎ అనువానికి పరివర్తన హక్కు ఉన్నది అనిచెప్పుచు, ఎక్స్ - వై - జడ్ - అనుమూడుపొలములను సి అనువానికి అమ్మెను. ఈపొలములలో జడ్ అను పొలము విభాగకాలమందు బి అనువానిపరము అయినది కాబట్టి ఎ అను వానికి చెందదు. బి అనువాని మరణానంతరము ఎ అనువాడు వారసుదారుడు కావున సదరు జడ్ అనుపొలమును పొందును. సి అనువాడు సదరువిక్రయకరారును త్రోసివేయలేదు. కావున సదరు జడ్ అనుపొలమును తనకు ఇచ్చివేయుమని కోరవచ్చును.

౪౪. పరివర్తనచేయు విషయములో చట్ట సమ్మతముగ అర్హులయియున్న ఇద్దఱు లేక ఎక్కువమంది భాగస్వాములలో చేరిన ఒకడు సదరు ఆస్తిలోని తన భాగమును కాని లేక అందుపయి తనకుగల హక్కును గాని పరివర్తనచేయు సంగతిలో, ఆలాగు పరివర్తనచేసిన భాగమునకుగాని లేక హక్కుకుగాని పరివర్తన తేదిని సంబంధపడి ఉన్న షరతులకును ఉత్తరవాదములకును లోనై అట్టి భాగమునుగాని హక్కును గాని పరివర్తన సిద్ధించుటకు ఎంతమట్టుకు ఆవశ్యకమో అంతమట్టుకు ఆయాస్తిని ఉమ్మడిగా స్వాధీనపఱుచుకొనగలందులకుగాని లేక ఇతరవిధముగా సామాన్యముగ అనుభవింపగలందులకుగాని భాగముగా అనుభవింపగలందులకుగాని, ఆయాస్తిని భాగించుకొనుటను నిర్బంధించుటకు పరివర్తన కైకొనువాడు పరివర్తనకర్తయొక్క హక్కును పొందును.

ఒక్కతోడి యజమాని వలన పరివర్తన.

అవిభక్త కుటుంబమువారి నివాస గృహముయొక్క భాగమును పరివర్తన కైకొనువాడు సదరు కుటుంబముతో చేరినవాడు అయిన పక్షమున, ఈసెక్షనులోనుండు చేనిని, ఆయింటిని ఉమ్మడిగ స్వాధీనపఱుచుకొనుటకు గాని లేక మఱియొకరీతిని సామాన్యముగ అనుభవించుటకుగాని లేక భాగించుకొనుటకుగాని అతనికి హక్కు గలుగ జేయునట్లు గ్రహింపగూడదు.



౪౫. ప్రతిఫలముకొఱకు ఇద్దరకుగాని లేక ఎక్కువమందికిగాని స్థిరాస్తి పరివర్తన చేయబడి వారికి అందఱుకు సామాన్యముగ చెందియున్న సొత్తు ముత్తములోనుండె ఆప్రతిఫలము చెల్లింపబడిన ఎడల, అన్యధా కరారులేని సంగతిలో, ఆ సొత్తు ముత్తముపైన వరుసగా హక్కు కలిగియున్న బాధ్యతలకు సాధ్యమైనంతమట్టుకు సమముగ అట్టి ఆస్తిలో వారికివరుసగా హక్కు ఉండును. వరుసగ వారిదైన సొత్తు ముత్తములో నుండి ప్రత్యేకముగా అట్టిప్రతిఫలము చెల్లింపబడు సంగతిలో, విరుద్ధముగు కరారు లేని పక్షమందు, వారువరుసగ పూర్వముచెల్లించిన ప్రతిఫలముయొక్క పాళ్ల దామాషాప్రకారము అట్టి ఆస్తి పై బాధ్యతలకు వారు వరుసగ హక్కుకలిగియుందురు.

ప్రతి ఫలమునకు గాను ఉమ్మడిపరివర్తన.

వారికి వరుసగ హక్కుకలిగి యున్నసొత్తు ముత్తములోని బాధ్యతలనుగుఱించి కాని పూర్వముచెల్లించిన పాళ్లను గుఱించికాని సాక్ష్యములేనిసంగతిలో, అట్టివారు ఆ స్తిపై సమానబాధ్యత కలిగియున్నట్లు తలంపవలయును.

౪౬. స్థిరాస్తిపైన ప్రత్యేకములగు హక్కులు కలవారు ప్రతిఫలముకొఱకు దానినిపరివర్తనచేయు విషయములో, అన్యధా కరారు లేనపుడు, ప్రతిఫలము తో పరివర్తన చేయువారికి సమముగను, సదరుహక్కులు సమానమగు విలువకలిగియుండిననేమి అసమానమగు విలువ కలిగియుండిననేమి వారి వారి హక్కుల విలువకు తగినట్లు భాగించుకొనుటకు హక్కు కలిగియుండవలయును.

వేర్వేఱు హక్కులు కల మనుష్యుల వలన ప్రతి ఫలమునకు గాను పరివర్తన.

## దృష్టాంతములు.

(ఎ) సుల్తానుపూరు గ్రామములో ఎ అనువానికి అ౧ భాగమును బి - సి అనువారలకు ప్రత్యేకప్రత్యేకముగ పాతిక పాలును కలవు. వారు అయూరిలో పరక

పాలును లాల్పురా గ్రామములోని పాతికపాలుకు పరివర్తనచేయుదురు. అన్యథా ఒప్పుదల ఒడంబడిక లేనందున ఎ అనువాడు లాల్పురాలోని పరక భాగమునకును బి-సి అనువారు సదరు గ్రామములో ౧౬ వ అంశ భాగమునకును హక్కు కలిగియుందురు.

(బి) అత్రౌలి అను గ్రామముమీద జీవితపర్యంతము హక్కును ఎ అనువాడును, పరావృత్తి హక్కును బి అనువాడును, కలిగియుండి సదరు గ్రామమును ౧,౦౦౦ రూపాయలకు విక్రయింతురు. ఎ అనువానికిగల జీవితపర్యంత హక్కు ౬౦౦ రూపాయల కిమ్మతును, బి-సి అనువారి పరావృత్తి హక్కు ౪౦౦ రూపాయల కిమ్మతును,గలవి అయినట్లు నిర్ణయింపబడును. సదరు కిమ్మతుధనములో ౬౦౦ రూపాయలు పొందుటకు ఎ అనువాడును, ౪౦౦ రూపాయలు పొందుటకు, బి-సి అనువారును హక్కు కలిగియుందురు.

*ఉమ్మడి ఆస్తిలోని భాగములు తోడియజమానులు పరివర్తనచేయుట.*

౪౭. పరివర్తనకర్తలయొక్క ఏదైన ముఖ్యమయిన భాగమువిషయమైకాని లేక భాగముల విషయముగు కాని పరివర్తన చెల్లవలయునని నిర్దేశింపకుండ స్థిరాస్తిలో ఒకభాగమును సదరు ఆస్తికి సంబంధపడు తోడియజమానులు పరివర్తన చేయు పక్షమందు అట్టిపరివర్తనకర్తలలో భాగములు సమానముగా నుండుపక్షమున సమముగాను, అసమానముగనుండు పక్షమున అట్టిభాగములపరిమాణమునకు తగినట్లును, అట్టిభాగముల విషయమగు పరివర్తన చెల్లును.

దృష్టాంతము.

సుల్తానుపూరు గ్రామములో ఎనిమిది అణాల భాగమునకు యజమాని అయిన ఎ అనువాడును ఒక్కొక్కడు నాలుగు అణాల భాగమునకు యజమానులయిన బి-సి అనువారును తమ వివిధ భాగములలో దేనినుండి పరివర్తన చేయుదురో దానిని నిర్ణయింపకుండ సదరు గ్రామములో రెండు అణాల భాగమును డి అనువానికి పరివర్తనచేయుదురు. సదరు పరివర్తనచెల్లగలందులకు ఎ అనువాని భాగమునుండి ఒక అణా భాగమును బి-సి అనువారి భాగములలో ఒక్కొక్క దానినుండి అరఅణా భాగమును తీసికొనిపోబడుచున్నవి.



*పరివర్తనచే పుట్టినహక్కుకు ప్రథమత్వము.*

౪౮. ఒకటేస్థిరాస్తిలోగాని లేక దానిమీదగానివిభేద కాలములయందు పరివర్తనమూలముగ హక్కులను పుట్టించుటకు ఒకడు తెలియజేసియుండి అట్టిహక్కులు యావత్తును ఏకకాలమందు కలుగనియెడల గాని లేకపూర్ణముగ చలాయింపుచేయబడజాలనియెడలగాని మొదటపరివర్తనకైకొన్నవారిని బద్ధులనుచేయు నిర్దిష్టకరారుగాని నిర్బంధముకాని లేనియెడల తర్వాతపుట్టిన ప్రతిహక్కును మొదటపుట్టిన హక్కులకులోబడి యుండవలయును.

*(పాలిసీని) భీమానుబట్టి పరివర్తన చేకొను వాని హక్కు.*

౪౯. స్థిరాస్తి ప్రతిఫలము కొఱకు పరివర్తన చేయబడి అట్టి ఆస్తికిగాని లేక అందుల ఏదైన భాగమునకుగాని పరివర్తన తేదిని నష్టమయినను లేక అగ్నివలన హానియైనను కలుగకుండ భీమా చేయబడియున్నయెడల, అట్టి నష్టముకాని హానికాని కలుగుసంగతిలో, అన్యథా కరారులేని పట్ల, పరివర్తనకైకొనువాడు సదరు భీమాను అనుసరించి పరివర్తనకర్త నిజముగ చేకొను పయికమునుగాని లేక అగత్యమయినంత అందలిభాగమునుగాని సదరు ఆస్తిని యథాస్థితికి తెచ్చుటకు కోరవచ్చును.

*బాధ్యతాలోపములతోడ ఆస్తినుంచుకొన్న వానికి వాస్తవముగ చెల్లింపబడు అద్దె.*

౫౦. ఏ స్థిరాస్తికయిన సంబంధించిన అద్దెలుగాని లాభములు గాని ఎవనికి చెల్లింపబడినవో లేక అప్పగింపబడినవో ఆ మనుష్యునకు సదరు అద్దెలుగాని లాభములుగాని వసూలు చేసి కొనుటకు హక్కు లేనట్లు తర్వాత అగపడినను, ఎవనికొఱకు తాను అట్టి ఆస్తినిన్యాయతః స్వాధీనమందు ఉంచుకొనెనో అట్టి ఏ మనుష్యునకయిన వాస్తవముగ అతడు చెల్లించియుండినగాని లేక అప్పగించియుండినగాని అట్టి ఆస్తిమీదవచ్చు అద్దెలనుగాని లేక లాభములనుగాని అతనివద్ద కట్టిపుచ్చుకొనగూడదు.

దృష్టాంతము.

ఎ అనువాడు బి అనువానికి ౫౦ రూపాయలకు ఒక చేనును అద్దెకు ఇచ్చి తర్వాత సదరు చేనును సి అనువానికి పరివర్తన చేయును. బి అనువాడు సదరు పరివర్తన విషయమయి నోటీసు పొందని హేతువున సదరు అద్దెను అకృత్రిమముగ ఎ అనువానికి ఇచ్చును. అట్లు చెల్లించిన అద్దెను బి అనువానికికట్టి పుచ్చుకొనగూడదు.

*బాధ్యతాలోపములతో వాస్తవముగా ఆస్తినుంచుకొన్న వారివలన చేయబడు అభివృద్ధులు.*

౫౧. స్థిరాస్తి పరివర్తన చేకొనినవాడు తనకు పూర్ణముగా సదరు ఆస్తిపై హక్కు ఉన్నదికదా అని నమ్ముచు సదరు ఆస్తికి బలము కలుగునట్లు ఏదైన అభివృద్ధి చేసియుండి తర్వాత సదరు ఆస్తికి అతనికంటె ఉత్తమమగు హక్కుకల ఏమనుష్యునివల్లనయినను సదరు హక్కునుండి తొలగింపబడినపుడు, సదరు పరివర్తన కయికొనినవాడు తాను చేసియున్న అభివృద్ధికి అయినకిమ్మతును మతింపుచేయించి ఇమ్మనిగాని లేక తనకు చెందునట్లు చేయుమనిగాని లేక సదరు అభివృద్ధి ఖర్చు మాట అవతల ఉంచి అప్పటి బజారు ధరప్రకారము సదరు ఆస్తిలోని వాని హక్కును తనకు (పరివర్తన కయికొన్న వానికి) విక్రయింపుమనిగాని పరివర్తన కయికొన్నవాడు సదరు హక్కునుండి తనను తొలగించిన వానిని కోరవచ్చును.

అట్టి అభివృద్ధికొఱకు చెల్లింపవలయునట్టి కాని లేక జాగ్రత పెట్టవలయునట్టికాని సొమ్ము మొత్తము సదరు బహిష్కరణ సమయమందు మతింపుచేయబడిన అభివృద్ధి కిమ్మతు అయియుండవలయును.

పయినచెప్పిన స్థితులలో పరివర్తన కయికొన్నవాడు ఆస్తిలోపయిరు వేసిగాని వెద పెట్టిగాని ఉండి ఆపయిరు తనను ఆస్తిహక్కులో నుండి తొలగించునప్పటికి పెరుగుచున్నపుడు అట్టి పయిరు పంటకును ఆ పంటను కోసి కయిలు చేసికొనుటకు సదరు ఆస్తిలోనికి నిరాటంకముగ పోవుటకు వచ్చుటకును వానికి హక్కు ఉండవలయును.



*ఆస్తిని గురించి వ్యాజ్యెము జరుగుచుండ దానిని పరివర్తన చేయుట.*

౫౨. బ్రిటిష్ ఇండియాకులోపల అధికారము కలిగిగాని లేక ఆలోచనసభలోని గవర్నర్ జనరలు గారివలన బ్రిటిష్ ఇండియా సరిహద్దులకు వెలుపల స్థాపింపబడిగాని ఉన్న ఏకోర్టులోనయినను స్థిరాస్తి సంబంధమగు ఏహక్కు అయినను ప్రత్యక్షముగాను ముఖ్యముగాను తకరరులో ఉండి దానికిగాను వివాదగల వ్యాజ్యెముగాని చర్యగాని జరుగుచున్నప్పుడు, సదరుకోర్టువారి అధికారమునబట్టియు వారు నిర్ణయించు షరతులను అనుసరించియు తప్ప, సదరు వ్యాజ్యెములోగాని లేక చర్యలోగాని చేయబడు డిక్రీని అనుసరించి అయినను లేక ఉత్తరవును అనుసరించి అయినను అందుతో సంబంధించిన ఇతర కక్షిదారునియొక్క బాధ్యతలకు హాని కలుగులాగు సదరు వ్యాజ్యెమునకుగాని చర్యకుగాని సంబంధపడిన ఏ కక్షిదారునివలననయినను ఆయాస్తి పరివర్తన చేయబడగూడదు, లేక ఇకనేవిధమునగాని దానిని పరిష్కరింపనుగూడదు.

*మోసపు పరివర్తన.*

౫౩. ప్రతి ఫలముకొఱకు స్థిరాస్తిని మొదటగాని తర్వాతగాని పరివర్తన కయికొన్నవారి నయినను తోడి యజమానులనయినను లేక అట్టి ఆస్తిపైన హక్కుగల యితరులనయినను దగా చేయవలయుననికాని లేక పరివర్తనకర్త తనయొక్క ఋణదాతలకు భంగము కలుగ జేయవలయు ననికాని వారి ఋణమును చెల్లించుటకాలస్యము కలుగజేయవలయు ననికాని ఉద్దేశము కలిగి చేసినస్థిరాస్తి పరివర్తన అలాగు దగాపఱుపబడికాని లేక భంగపఱుపబడిగాని లేక ఆటంకపఱుపబడికాని ఉన్న ఏ మనుష్యునియొక్క యిష్టమును అనుసరించి అయినను రద్దుకాదగి యున్నది.

స్థిరాస్తి పరివర్తనాఫలము అట్టివానిని మోసముచేయుటకుగాని భంగపఱుచుటకుగాని ఆటంకపఱుచుటకుగాని అయియుండి అట్టిపరివర్తన, ఉచితముగనయినను లేక మిక్కిలి తక్కువ ప్రతిఫలముచేకొని అయినను,

చేయబడినపుడు అట్టి పరివర్తన పైనచెప్పిన తాత్పర్యముతో చేయబడినట్లే ఎన్నబడును.

ఈ సెక్షనులో నుండునది ఏదియు న్యాయతాత్పర్యముతోను ప్రతిఫలప్రతికారముగను కైకొను ఏపరివర్తనచేకొనువాని హక్కులను బాధింపదు.

## ౩ వ అధ్యాయము.

### స్థిరాస్తి విక్రయములను గురించి.

“విక్రయము” నిర్వచించుట.

౫౪. “విక్రయము” అనగ క్రయధనమును చెల్లించినమీదటగాని లేక చెల్లించుటకు వాగ్దానము చేసినమీదటగాని లేక కొంతభాగము చెల్లించి కొంతభాగము వాగ్దత్తము చేసినమీదటగాని దానికి బదులుగ స్వామ్యమును పరివర్తనచేయుట.

విక్రయ మెట్లు చేయబడునది.

నూఱు రూపాయలును అంతకు మించియును ఖరీదుకల సాధ్యమగు స్థిరాస్తివిషయములోగాని లేక పరావృత్తి బాధ్యత విషయములోగాని లేక ఇతర అసాధ్యవస్తువు విషయములోగాని అట్టిపరివర్తనరిజిస్టరు సాధనమూలముగనె చేయబడదగును.

నూఱు రూపాయల కిమ్మతుకు తక్కువకిమ్మతుగల సాధ్య స్థిరాస్తివిషయములో రిజిస్టరుచేయబడి సాధనమూలముగగాని లేక ఆస్తిని స్వాధీనపఱుచుటవలనగాని అట్టి పరివర్తన చేయబడవచ్చును.

సాధ్యస్థిరాస్తి స్వాధీనపఱుచుట, అమ్మువాడు సదరు ఆస్తిని కొనినవానికిగాని లేక అతడు ఆజ్ఞాపించు మనుష్యునికి గాని స్వాధీనపఱుచునపుడు ఘటస్థించును.



విక్రయమునకు కరారు.

స్థిరాస్తి విక్రయమునకుగల కరారు, సదరు ఆస్తివిక్రయము, కక్షిదారులు ఏర్పఱుచుకొని ఫయిసలుచేసికొన్న నిబంధనలమీద జరుగవలయునట్టి కరారే.

అది దానంతట అది ఆస్తిపయిన ఏ హక్కునుగాని పూచీనిగాని కలుగచేయదు.

అమ్మువానియొక్కయు కొనువానియొక్కయు హక్కులును జవాబుదారీలును.

౫౫. స్థిరాస్తిని కొనువాడును అమ్మువాడును, అన్యథా కరారులేనిచో వరుసగ ఈక్రింద ఉదాహరింపబడిన విధులలోగాని లేక అమ్మబడిన ఆస్తికి వానిలో ఏవి ప్రయోగపడునో అట్టి వానిలోగాని చెప్పియున్న జవాబుదారీలకు లోనై, అట్లు చెప్పియున్న హక్కులను కలిగియుండవలయును.

(౧) అమ్మువాడు—

(ఎ) అమ్మువాడు ఎఱిగియుండి కొనువాడు ఎఱుగనట్టియు కొనువాడు తన సాధారణ జాగ్రతవలన కనుగొనజాలనట్టియు ఆయాస్తిలో నున్న ముఖ్యమయిన ఏ లోపమునయినను కొనువానికి తెలియపఱుచుటకు,

(బి) అమ్మువాని స్వాధీనమందుగాని అధికారమందుగాని ఉన్న సదరు ఆస్తికి సంబంధించు హక్కు దస్తావేజులను అన్నిటిని పరీక్షార్థము చూపుమని కోరినమీదట కొనువానికి చూపుటకు,

(సి) సదరు ఆస్తినిగురించికాని అందుల హక్కునుగురించికాని కొనువాడుచేయునట్టి క్రమమయిన ప్రశ్నలకు అన్నిటికి తనకు తెలిసియున్నంతవఱకు అమ్మువాడు ఉత్తరములు చెప్పుటకు,

(డి) సదరు ఖరీదువిషయములో బాకీపడు సొమ్ము మొత్తము చెల్లించినమీదటగాని లేక చెల్లింపవచ్చినమీదటగాని తగినకాలమందును స్థలమందును పత్రముపుట్టుటకు కొనువాడు పయికమును ఇచ్చినపుడు, ఆస్తి తాలూకు న్యాయమైన పత్రమును వ్రాసియిచ్చుటకు,

(ఇ) విక్రయపుకరారు తేదికిని సదరు ఆస్తిని విడుదలచేయుటకును మధ్య తనస్వాధీనమందు ఉన్న ఆయాస్తిని గుఱించియు దానికిసంబంధించిన హక్కు దస్తావేజులను గుఱించియు, ఆ యాస్తియొక్కయు దస్తావేజులయొక్కయు యజమానుడు సాధారణమయిన తెలివితో ఎట్లుజాగ్రతపుచ్చుకొనునో అట్లు జాగ్రత పుచ్చుకొనుటకు,

(యఫ్) సదరు ఆస్తి స్వాధీనమును, దానిస్వభావమును అనుసరించునట్లుగ, కొనువానికిగాని లేక అతడు ఉత్తరువు ఇచ్చుమనుష్యునకుగాని అట్లు కోరినమీదట చేయుటకు,

(జి) సదరు విక్రియదినమువఱకు ఆస్తిమీద ఉండు పబ్లికుబాకీలు, వచ్చిన అద్దెలు, ఆ తేదికి బాకీయున్న అట్టి ఆస్తిమీది ఋణములు, ఆ ఋణముల కన్నిటికిగలవడ్డియు, చెల్లించి అట్టిఋణములకు లోనుజేసి ఆస్తి అమ్మబడిన సంగతిలోదప్ప ఆస్తిమీద అప్పటికి ఉన్న ఋణములను అన్నిటినితీర్చి వదలించుటకును,

బద్ధుడైయుండును.

(౨) అమ్మువాడు కొనువానికి పరివర్తనచేయుదును అనిచెప్పు హక్కు వానికి కలదనియు, దానిని పరివర్తనచేయుటకు తనకు అధికారముకలదనియు, కొనువానితో అమ్మువాడు కరారుచేయునట్లు గ్రహింపవలయును:

అయినను దృఢ విశ్వాసగుణముతో ఒకనివలన విక్రయము చేయబడినపుడు, వాడు ఆస్తిఋణములలో చిక్కుకొనునట్లును అందువలన దానిని పరివర్తనచేయుటకు ఆటంకము కలుగునట్లును అమ్మువాడు ఏకార్యమును చేయలేదని కొనువానితో కరారుచేసినట్లు గ్రహింపవలయును.

ఈ విధిలో ఉదాహరింపబడిన కరారులోని ప్రయోజనమును పరివర్తనకై కొనువానికి అట్టివాడుగనే వానిహక్కుతో చేర్పబడి అనుసరింపచేయబడవలయును. అట్టిహక్కు యావత్తుకాని కొంతభాగముకాని అప్ప



డప్పుడు ఎవనికిచెందునో వాడు సదరు ప్రయోజనమును పొందుటకు నిర్బంధపెట్టవచ్చును.

(౩) క్రయధనము యావత్తు అమ్మువానికి చెల్లింపబడినప్పుడు, సదరు అమ్మువాని స్వాధీనమందున్న లేక అధికారమందున్న ఆస్తి సంబంధమగు హక్కు దస్తావేజులను అన్నిటిని కొనువానిపరము చేయుటకునూడ అమ్మువాడు బద్ధుడైయుండును:

అయినను, (ఎ) అట్టి దస్తావేజులలో చెప్పియున్న ఆస్తితాలూకు ఏదైన భాగమును విక్రయించు మనుష్యుడు ఉంచుకొను సంగతిలో, వానిని అన్నిటిని ఉంచుకొనుటకు అతనికి హక్కుకలదు; మఱియు (బి) అట్టి ఆస్తియావత్తును వేఱువేఱుమందికి విక్రయించియున్నయెడల, అధికవిలువగల భాగమును కొన్నవాడు ఆ దస్తావేజులు పొందుటకు హక్కు కలిగియుండును. అయినను, ఆయాసంగతికి తగినట్లు, కొన్నవాడుగాని అట్లుకొన్న ఇతరమనుష్యులలో ఎవడయినను గాని న్యాయముగ మనవి చేసికొన్నపుడెల్ల మనవిచేసికొన్నవాని ఖర్చునమీద (ఎ) గుర్తుగల సంగతిలో అధికవిలువగల భాగమును విక్రయించినవాడును (బి) గుర్తుగల సంగతిలో కొన్నవాడును సదరు దస్తావేజులనుకనుపఱిచి అతనికి కావలసియున్న వానికి నాస్తసైన నకళ్లనుగాని లేకవాని ఎక్స్ట్రాక్టులనుగాని అమర్చి ఉండుటకు బద్ధులయి ఉందురు. ఇంతలో అగ్నివలనగాని లేక అనివార్యమగు ఇతర అపాయము వలనగాని సదరు దస్తావేజులను రద్దుపఱుపకుండను చెడగొట్టకుండను భద్రముగా యుంచుటకు ఆటంకము తటస్థించి యుండిననేతప్ప, అధిక కిమ్మతు కలభాగమును అమ్మువాడుకాని కొనువాడుకాని ఆయాసంగతినిబట్టి వానిని ఆలాగు భద్రముగ ఉంచవలయును.

(౪) అమ్మువానికి —

(ఎ) సదరు ఆస్తిపయిన స్వామ్యముకొనువానికి దఖలుపడినదాక సదరు ఆస్తిపైనవచ్చు అద్దెలను లాభములను పొందుటకు హక్కు గలదు;

(బి) క్రయధనము యావత్తు చెల్లించుటకు పూర్వము సదరు ఆస్తిపయిని స్వామ్యము కొనువానికి చెందు సంగతిలో, సదరు క్రయధనపు మొత్తమునకుగాని చెల్లించకుండ నిలిచియున్న అందుల భాగమునకు దేనికయినగాని అట్టి మొత్తము మీదనయినను భాగము మీదనయినను వచ్చు వడ్డికిగాని కొన్నవాని స్వాధీన మందు ఉన్న ఆస్తిపైన పూచీని పొందుటకు హక్కు కలదు.

(౫) కొనువాడు —

(ఎ) సదరు ఆస్తిపయిన అమ్మువానికిగల హక్కు యొక్క స్వభావము కాని పరిమితికాని కొనువాడు ఎఱిగియుండి అవి అమ్మువానికి తెలియవని నమ్ముటకు తనకు కారణము ఉండి, అట్టివిముఖ్యముగ సదరు హక్కు యొక్క కిమ్మతును ఎక్కువ చేయునదిగా ఉండు ఏసంగతి నయినను అమ్మువానికి తెలియజేయుటకు,

(బి) విక్రయమును పూర్తి పఱిచిన కాలమందును అట్టిచోటను సదరు క్రయధనమును అమ్మువానికిగాని లేక అతని ఉత్తరువును పొందిన మనుష్యునకుగాని చెల్లించుటకయినను లేక చెల్లింప వచ్చుటకయినను, (అయిన సదరు ఆస్తి ఋణసంబంధములగు చిక్కులు లేకుండ అమ్మబడునపుడు, కొనువాడు సదరు క్రయధనములోనుండి క్రయదినమునకు ఉండియున్న సదరు ఆస్తిపయిని ఋణముల మొత్తమును తీసికొని, అట్లు తీసికొనిన మొత్తమును హక్కుదారులగువారికి చెల్లింపవలయును),

(సి) సదరు ఆస్తిపయిని స్వామ్యము కొనువాని పరమయినపుడు అమ్మువానివలన గలిగింపబడని ఆస్తి తాలూకు సంబంధించిన నాశము వలనగాని లేక అపాయము వలనగాని లేక తగ్గిపోవుటవలనగాని సంభవించు నష్టమును వహించుటకు,



(డి) కొనువానికి అమ్మువానికి గల వ్యవహారములో వలె సదరు ఆస్తి పయిని స్వామ్యము కొనువాని పరమయినపుడు, అట్టి ఆస్తికగాను చెల్లింపవలసి వచ్చు పబ్లికు వ్యయములు, అద్దె ఆస్తిపయిని ఋణములకు లోనయి సదరు ఆస్తిని అమ్మినపుడు అట్టి ఋణములమీద బాకీపడు అసలుపయికమును తర్వాత బాకీ అయినందువలన గలిగిన అందులవడ్డిని చెల్లించుటకు,

బద్ధుడై యుండవలయును.

(౬) కొనువాడు —

(ఎ) ఆస్తిపయిని స్వామ్యము తనపరమయినపుడు, సదరు ఆస్తియొక్క ఏ యభివృద్ధివలననయినగాని అందలివిలువను ఎక్కువ చేయుటవలనగాని వచ్చు లాభమునకు దాని పయిన గలుగు అద్దెలకును లాభములకును,

(బి) అతడు అక్రమముగ ఆస్తి విడుదలను అంగీకరింపక విడిచిపెట్టిననే తప్ప, అమ్మువానికి సదరు పయికము చెల్లించుట విషయమై నోటీసును పొంది ఉండి వాని తరఫున దావాచేయు అందఱకును విరుద్ధముగ ఆస్తి విడుదలను అపేక్షించుచు కొనువానివలన క్రమముగ చెల్లింపబడిన క్రయధనపు మొత్తమునకును అట్టి మొత్తముమీదవచ్చు వడ్డికిగాను సదరు ఆస్తిమీద అమ్మువానికి ఉన్న హక్కు పరిమితివఱకు, సదరు ఆస్తిపయిని వ్యయమునకును, మఱియు అతడు క్రమముగ అట్టి విడుదలను అంగీకరింపక విడిచి పెట్టినపుడు సంచకరువు (ఏదయిన ఇచ్చి ఉన్న) దానికిని కరారులో నిర్దేశింప బడిన కార్యము చేయుట కొఱకు నిర్బంధించుటకు గాని లేక రద్దు చేయుటకై డిక్రీని పొందుటకుగాని,

హక్కు కలిగి ఉండును.

ఈ సెక్షను ౧ టో పేరా (ఎ) క్లాజులోను ౫ దో పేరా (ఎ) క్లాజులోను చెప్పియున్న ప్రకారము తెలియబఱుపకుండ వదలివేయుట మోసకరమయినదిగా నుంటున్నది.

ఒక పూంచీ (చార్జి) కె లోబడియుండు రెండుఆస్తులలో నొకదానివిక్రయము.

౫౬. రెండు ఆస్తులు ఒకనిపరములోనె ఉండి వానిలో ఒకటి అమ్మబడినపుడు, కొనువాడు, అన్యథా కరారులేని యెడల, అమ్మువానికి విరుద్ధముగ రెండవ ఆస్తిలోనుండి సదరుపూంచీని అట్టిఆస్తికి ఎంతవఱకు పరిమితి ఏర్పడియున్నదో అంతవఱకు సఫలముచేయుమని అడుగుటకు హక్కు కలిగి యుండును.

విక్రయానంతరము చిక్కులను తొలగించుట.

అప్పు చిక్కులకునువాని నుంచి తొలగించి చేయబడు విక్రయమునకును కోర్టువారియేర్పాటు.

౫౭. (ఎ) తక్షణము చెల్లింపదగినదిగానయినను కానిదిగానయినను వున్న ఋణమునకు లోబడి కోర్టువారి వలన గాని కోర్టు డిక్రీని అమలు చలాయించుటకు గాని కోర్టువెలుపలనుగాని స్థిరాస్తిని విక్రయించువిషయములో కోర్టువారు తమకుయుక్తమని తోచిన యెడల విక్రయముతో సంబంధముగల ఏకక్షిదారుడు అయినను దరఖాస్తు చేసికొనినమీదట,

(౧) ఆస్తిమీద పద్దుకట్టిన సంవత్సరవారి మొత్తముయొక్కగాని మాసవారి మొత్తముయొక్కగాని విషయములోనైనను, లేకసదరు ఆస్తిలోని కడముట్ట వచ్చు వడ్డీమీద గట్టబడిన మూలధనము విషయములోనయినను, — ఇండియా గవర్నమెంటువారి పత్రముల మూలముగ వడ్డికి వేసివున్నపుడు అందుల వడ్డిమూలముగ ఆలాగు కట్టినదానిని తప్పించుటకుగాని లేక మఱియొక విధముగ యేర్పాటు చేయుటకుగాని కోర్టువారు యుక్తమని తలచు మొత్తమును,

(౨) సదరు ఆస్తిమీద కట్టబడిన మూలధనము తాలూకు ఏదయినవిషయములో, — సదరు ఋణమును దానిమీద బాకీపడియున్న ఏదయిన వడ్డిని చెల్లించుటకు చాలినంత మొత్తమును,



కోర్టులోనే తీర్చివేయుటకు ఉత్తరవుకాని సెలవుకాని కోర్టువారు ఇయ్యవచ్చును.

కాని ఏ పక్షములోనయినను, కోర్టువారు, విశేషకారణములనుబట్టి (వారు వానినిరికార్డు చేయవలయును) ఇంకను ఎక్కువ మొత్తమును చెల్లించుమనుట వారుయుక్తమని తలచినతప్ప కోర్టువారు ఇతరఖర్చులకు చాలునని తలచునట్టి అధికమగు మొత్తమును, ఖర్చును, వడ్డినిగాని, పెట్టుబడిసొమ్ము తగ్గిపోయినపుడుగాక, చెల్లింపవలయు అసలు మొత్తములో పదింటిలో ఒక పాలునకు మించకుండ ఉండు ఇతర చిల్లర ఖర్చులనుగాని, కోర్టులో చెల్లింపవలయును.

(బి) అందుమీద కోర్టువారికి తగును అని తోచినపక్షమునను, కోర్టువారు వ్రాతమూలముగ రికార్డుచేయు కారణములనుబట్టి నోటీసును ఋణస్థునకు ఇచ్చుటతో పనిలేదని వదలివేయుటయుక్తమని వారు తలచినప్పుడు తప్ప, ఋణస్థునకు నోటీసు ఇచ్చినతర్వాతను, అట్టి ఆస్తిని ఋణబాధల నుండి వదలించుమని కోర్టువారు నిర్ధారణచేసి సదరు విక్రయమును సఫలముచేయుటకు దగిన క్రయ పత్రమునుగాని లేక విక్రయసూచకమగు ఉత్తరువునుగాని ఇయ్యవచ్చును, మఱియు సదరు సైకమును కోర్టులో ఉంచి వడ్డికివేయుటకు తగినట్లు ఆజ్ఞాపింపవచ్చును.

(సి) కోర్టులోనున్న పయికమునుగుఱించికాని ఫండును గుఱించికాని బాధ్యతనయినను హక్కునయినను గలవారికి నోటీసులను జారీచేసినతర్వాత దానిని పుచ్చుకొనుటకుగాని లేక అందులకు చెల్లుచీటీని ఇచ్చుటకుగాని హక్కుకలవారికి దానిని చెల్లించునట్లయినను లేక పరివర్తన చేయునట్లయినను కోర్టువారు ఉత్తరవుచేసి అసలు పయికమునుగాని లేక దానిపైని వచ్చుబడినిగాని వినియోగించు విషయమైనను పంపకము విషయమైనను సాధారణముగ హుకుములను ఇయ్యవచ్చును.

(డి) ఈసెక్షనునుబట్టిచేసినప్రకటనకాని ఉత్తరవుకానిహుకుముకాని ఏదైన ఉండినచో, డిక్రీవిషయములో ఎట్లో అట్లే దానిపైనను అప్పీలుకలదు.

(ఇ) ఈ సెక్షనులోని "కోర్టు" అనుమాట (౧) సాధారణాసాధారణములగు సివిల్ విచారణాధికారము చలాయించుటలో హైకోర్టు అనికాని (౨) ఎవని అధికారప్రదేశ హద్దులకులోపల ఆస్తి అయినను అందులభాగము అయినను ఉండునో ఆడిస్ట్రిక్టు జడ్జిగారి కోర్టు అని కాని (౩) ఈసెక్షనుచే కలుగజేయబడిన అధికారమును చలాయించుటకు తగియున్నట్టు ప్రదేశ గవర్న్మెంటువారు సర్కారు గెజెటులో ప్రకటనద్వారా అప్పుడప్పుడు ప్రకటించు ఏ యితరకోర్టు అనికాని అర్థమగును.

---

## ౪ వ అధ్యాయము.

### స్థిరాస్తి తాకట్టులను దానిమీది పూచీ (చార్జి) లను గుఱించి.

"తాకట్టు," "తాకట్టుంచు వాడు," "తాకట్టుంచు కొన్న వాడు", "తాకట్టు ధనము," "తాకట్టు పత్రము," నిర్వచించుట.

౫౮. (ఎ) "తాకట్టు" అనగ అప్పుగా ఇయ్యబడినటువంటికాని లేక ఇయ్యబడబోవు నటువంటికాని సొమ్మును చెల్లించుటను, ఇప్పుడు ఉన్నట్టికాని లేక ఇంక ఉండబోవునట్టికాని అప్పును, ధనసంబంధమగు జవాబుదారీని ఉత్పాదించునట్టి ఒడంబడికను నెఱవేర్చుటను భద్రపఱుచుటకై నిర్దిష్ట స్థిరాస్తిపైని హక్కును పరివర్తనచేయుట.

పరివర్తనకర్త తాకట్టు ఉంచువాడనియు పరివర్తన చేకొనువాడు తాకట్టు ఉంచుకొన్నవాడనియు జెప్పబడుదురు. ఏ పైకపు చెల్లుతలమునకు భద్రము చేసికొనబడుచున్నదో ఆ అసలు పైకమును, దానిమీది వడ్డియు, తాకట్టుధనమనబడును. మఱియు దేనివలన సదరు పరివర్తనచేకొనబడుచున్నదో (ఏదయిన ఉన్నచో) ఆపత్రము తనఖాపత్రమనబడును.

వట్టి తాకట్టు.

(బి) తాకట్టుపెట్టిన ఆస్తియొక్క స్వాధీనమును ఒప్పగింత చేయకుండనే తాకట్టుంచువాడు సదరు తాకట్టు ధనమును చెల్లించుటకుగాను తానే బద్ధుడయియుండి



తనకరారుప్రకారము చెల్లింపక తప్పిపోవుసంగతిలో తాకట్టు ఆస్తినితాకట్టుంచుకొన్నవాడు అమ్మించి ఆవిక్రయధనమును, ఆవశ్యకమైనంతవఱకు తాకట్టుధనమును చెల్లించుటయందు ఉపయోగపఱుచుటకు స్పష్టముగానయినను భావజ్యోతకముగానయినను ఒప్పుదలచేయునపుడు, సదరు వ్యవహారము వట్టి తాకట్టు అనియు, ఆ తాకట్టుంచుకొన్నవాడు వట్టి తాకట్టుంచుకొన్నవాడనియు, చెప్పబడును.

షరతుబద్ధక విక్రయమూలమగు తాకట్టు.

(సి) ఒకానొక తేదీని ఆ తాకట్టుధనమును చెల్లింపకతప్పిపోయినమీదట సదరు విక్రయము స్థిరముకావలయునను షరతుమీదను, లేక—

ఆప్రకారము సదరుధనమును చెల్లించినమీదట సదరువిక్రయము నిష్ఫలముకావలయునను షరతుమీదను, లేక

ఆప్రకారము సదరుధనమును చెల్లించినమీదట కొనువాడు ఆయాస్తిని అమ్మువానికి పరివర్తనచేయవలయునను షరతుమీదను, లేక

తాకట్టుంచు వాడు ఆ తాకట్టు ఆస్తిని ఊరక అమ్ము విషయములో సదరువ్యవహారముషరతు బద్ధవిక్రయమూలమగు తాకట్టు అనియు, ఆతాకట్టుంచుకొన్నవాడు షరతు బద్ధ విక్రయమూలమగు తాకట్టుంచు కొన్నవాడనియు, చెప్పబడును.

భోగ్యప్రతాకట్టు.

(డి) తాకట్టుంచువాడు, తాకట్టుంచుకొన్నవానికి తాకట్టు ఆస్తినిస్వాధీనపఱచి తాకట్టుధనమును చెల్లించు వఱకును ఆప్రకారము స్వాధీనమందు ఉంచుకొనుటకును, ఆస్తిలోనుండి వచ్చు అద్దెలనులాభములను పుచ్చుకొనుటకును వానిని,వడ్డికి బదులుగానయినను తాకట్టు ధనముసదు చెల్లుగానయినను, లేక కొంతమట్టుకు వడ్డికి బదులుగానైనను కొంతమట్టుకు తనఖాధనమునదు చెల్లుగానైననువినియోగించుకొనుటకును అధికారము కలుగజేయునెడల,ఆవ్యవహారముభోగ్యప్రతనఖా అని చెప్పబడును. తనఖావుంచుకొన్నవాడు భోగ్యపుతనఖావుంచుకొన్నవాడని చెప్పబడును.

ఇంగ్లీషు తాకట్టు.

(ఇ) తనఖావుంచువాడు తనఖా ధనమును ఒకానొక తేదిని మరలచెల్లించులాగు బద్ధుడయి, తనఖా ఆస్తిని తనఖావుంచుకొన్నవానికి సంపూర్ణముగ పరివర్తన చేసియు, ఒప్పుకొన్న ప్రకారము తనఖా ధనమును చెల్లించిన మీదట సదరు తనఖావుంచుకొన్నవానికి మరల పరివర్తనచేయుదునను షరతుకు లోబడియున్నయెడల, ఆవ్యవహారము ఇంగ్లీషు తనఖా అని చెప్పబడును.

తనఖా ఎప్పుడు రూఢిగా ఉండునది.

౫౯. ఏ అసలు పైకముకై తనఖాపెట్టబడినదో అది వంద రూపాయలుగనయినను అంతకుమెక్కువగ నయినను ఉన్నపుడు తనఖావుంచువాని చేవ్రాలు కలిగికనీసము ఇద్దఱు సాక్షులవలననయిన చేవ్రాలుచేయబడిన రిజష్టరు దస్తావేజుమూలముగమాత్రమె సదరు తనఖాను సిద్ధించునట్లు చేయవచ్చును.

దేనికై తనఖా పెట్టబడినదో ఆ యసలుపైకము వంద రూపాయలకు తక్కువ అయినయెడల, పైనచెప్పినట్టు చేవ్రాలుచేయబడి సాక్షి చేవ్రాలుచే స్థాపింపబడిన దస్తావేజు మూలముగనయినను లేక (వట్టి తనఖా సంగతిలో తప్ప) ఆస్తి ఒప్పగింత మూలముగనయినను ఆ తనఖాను సిద్ధించునట్లు చేయవచ్చును.

ఈ సెక్షనులోనుండునది ఏదియు సదరు స్థిరాస్తిమీద తనఖాను కలుగజేయవలయునను ఉద్దేశముతో దానిపయినహక్కుకు సంబంధించిన దస్తావేజులను ఋణప్రదాతకుగాని లేక అతని ఏజెంటుకుగాని ఒప్పగింతచేయుటవలన, కలకత్తా, మదరాసు, బొంబాయి, కరాచి, రంగూన్, పట్టణములలోపెట్టిన తనఖాలను దుర్బలముచేయునట్టు తలంపగూడదు.

## తాకట్టు ఉంచువాని హక్కులును జవాబుదారీలును.

౬౦. అసలు పయికము చెల్లింపవలసినది అయినతర్వాత ఎప్పుడయినను తాకట్టుంచువాడు తగిన స్థలమందును కాలమందును తాకట్టుధనము



(తాకట్టును) విడిపించుకొనుటకు తాకట్టుంచువానికిగల హక్కులు.

ను చెల్లించిన మీదటగాని లేక చెల్లింప వచ్చిన మీదటగాని (ఎ) తాకట్టు పత్రమును, ఏదయిన ఉన్నయెడల, దానిని తాకట్టుంచువానికి ఒప్పగింత చేయుమనియు (బి) తనఖా వుంచుకున్నవాని యొక్క స్వాధీనమందు ఆ తాకట్టు ఆస్తి ఉండుసంగతిలో, దానిని తనఖావుంచువానిపరముగ స్వాధీనముచేయు మనియు, మఱియు (సి) తనఖావుంచువానికి తగులుబడియగునట్లె తాకట్టు ఆస్తిని తనకుగాని లేక తన ఉత్తరువునుపొందిన మూడవవానికిగాని మరల పరివర్తనచేయుమని అయినను తాకట్టుంచుకొన్నవానికి పరివర్తన చేయబడిన తనహక్కు విషయమయి తనకేమియు బాధ్యతలేదను హక్కు నశింపచేయబడినదని లిఖిత మూలకమయిన ఒప్పుదల చీటీని వ్రాసి (రెజిష్టరు చేయబడిన పత్రము మూలముగ తాకట్టును పెట్టు సంగతిలో) దానిని రెజిష్టరు చేయుమనియయినను, తాకట్టుంచుకొన్నవానిని అడుగుటకు హక్కుకలదు.

అయినను ఈసెక్షను కలుగచేసిన హక్కు, కక్షిదారుల యుభయుల వ్యవహారమువల్లగాని లేక కోర్టువారి ఉత్తరువువల్లగాని, నశింపచేయబడగూడదు.

ఈసెక్షను కలుగచేసిన హక్కు, విడుదలచేయుటకయిన హక్కు అనియు, దానిని అమలులోనికి తెచ్చుటకయిన దావా, విడుదల కోరికయిన దావా, అనియు చెప్పబడును.

ఈ సెక్షనులో నుండు దేనిని, అసలు పయికమును చెల్లించుటకుగాను నిర్ణయింపబడిన కాలమును గడచిపోనిచ్చినయెడలగాని, లేక అట్టి కాలము నిర్ణయింపబడని యెడలగాని, అట్టి పయికమును చెల్లించుటకైనను లేదా చెల్లింపవచ్చుటకయినను ముందున్యాయమయిన నోటీసును పొందగలందులకు తాకట్టుంచుకొన్నవానికి హక్కు కలదను నిబంధనను దేనినయినను, దుర్బలపఱచునట్లు గ్రహింపగూడదు.

తాకట్టుంచువాడు లేక తాకట్టుంచువారు ఒకనికంటె నెక్కువమంది ఉన్నయెడల ఆ తాకట్టుంచు వారందఱును తాకట్టుకాని యొక్క పాలును యావత్తుకాని కొంత భాగముకాని పొందియుండిననే తప్ప, తాకట్టు ఆస్తిలోని కొంతభాగమునకే బాధ్యతకలవాడు తాకట్టుమీద బాకీగానున్న మొత్తములో అందలి దామాషాకు తగినట్లు పయికమును చెల్లించుమీదట తన భాగమును మాత్రము విడిపించుకొనుటకు, ఈ సెక్షనులోనుండు ఏదియు హక్కును కలుగచేయనేరదు.

తాకట్టు ఆస్తిలోనుండి (కొంత) భాగమును విడిపించుట.

౬౧. ఏదయిన ఒక తాకట్టును విడిపింప బ్రయత్నించునట్టి తనఖావుంచువాడు, అన్యథా కరారులేనిపట్లు, తాను విడిపింప బ్రయత్నించునట్టియు తాకట్టులో చెప్పబడినదిగానట్టియు ఏదయిన ఇతర ఆస్తివిషయమై, తానుగాని లేక ఎవనితరఫున తాను దావాచేయునో అట్టి ఏమనుష్యుడయినగాని, పెట్టిన ప్రత్యేకపు తాకట్టును చేసినయినబట్టి రావలసియున్న ఏదయిన పయికమును చెల్లింపకుండ ఆలాగుచేయుటకు హక్కును కలిగియుండవలయును.

ప్రత్యేకముగ తాకట్టు పెట్టబడిన రెండు ఆస్తులలో నొక దానిని విడిపించుటకు హక్కు.

దృష్టాంతము.

జడ్ - వై అను కమతపు భాగముల ఖామందు అయిన ఎ అనువాడు జడ్ అను కమతపు భూమిని బి అనువానికి ౧,౦౦౦ రూపాయలకు తాకట్టు పెట్టెను. ఎ అనువాడు తర్వాత వై అను కమతపు భూమిని బి అనువానికి ౧,౦౦౦ రూపాయలకు తాకట్టుపెట్టి జడ్ అను కమతపు భూమిమీద ఎక్కువ పూచీ దేనికొఱకు ఏర్పాటు చేసియుండడు. జడ్ అను కమతపు భూమిమీది తాకట్టును మాత్రము విడిపించుకొనుటకు ఎ అనువాడు దావా తేవచ్చును.

౬౨. (ఎ) ఆ స్తిపయిన వచ్చు అద్దెలలో నుండియు లాభములలోనుండియు తాకట్టు ధనమును తాకట్టుంచుకొన్నవాడే చెల్లు పెట్టుకొనులాగు అతనికి అధికారము కలిగియుండు సంగతిలో, అట్టిపయికమును చెల్లించినపుడు,

భోగ్యపు తాకట్టుంచువానికి మరల స్వాధీనము పొందుటకుగల హక్కు.



(బి) అట్టి అద్దెలలోనుండియు లాభములలో నుండియు అసలు పయికముయొక్క వడ్డిని తాకట్టుంచుకొనువాడే చెల్లుపెట్టుకొనులాగు అతనికి అధికారముకలిగియున్న సంగతిలో, తాకట్టుధనమును చెల్లించుటకు కాలమేదయిన నిర్ణయింపబడియుండి అది గడిచిపోయినపుడును సదరు తాకట్టుపెట్టువాడు తాకట్టును పెట్టించుకొనువానికి అసలుపయికమును చెల్లించునపుడుకాని లేక చెల్లింపవచ్చినపుడుగాని లేక ఇందులో ఈక్రింద చెప్పియున్న ప్రకారము దానిని కోర్టులో అనామతుగా ఉంచునప్పుడును,

భోగ్యపు తాకట్టు సంగతిలో తాకట్టుంచువాడు సదరు ఆస్తిసయుని స్వాధీనమును మరలపొందుటకు హక్కును గలిగియుండును.

౬౩. తాకట్టుంచుకొనువాని స్వాధీనమందున్నట్టి తాకట్టు ఆస్తి తాకట్టులో ఉన్నపుడు ఏదయిన అభివృద్ధి కలిగినవిషయములో ఆ యాస్తి విడుదల అయినమీదట, అన్యథా కరారులేనిచో, తాకట్టుంచువాడు తాకట్టుంచుకొన్నవానికిగాక ఆయభివృద్ధికి హక్కు కలిగియుండును.

తాకట్టుసొత్తుకభివృద్ధి.

తాకట్టుంచుకొన్నవాడు ఖర్చు పెట్టుకొని అట్టి అభివృద్ధిని గలుగజేసి అసలు సొత్తుకు హాని లేకుండ దానిని ప్రత్యేకముగ స్వాధీన పఱచుకొని అనుభవించుటకు పాత్రుడయి యుండు సంగతిలో, ఆ యభివృద్ధిని చేకొనగోరునట్టి తాకట్టుంచువాడు, దానిని గలుగచేసినందుకు అయిన తగులుబడిని తాకట్టుంచుకొన్నవానికి చెల్లింపవలయును. అట్టి ప్రత్యేక స్వాధీనముగాని లేక అనుభవముగాని సాధ్యముకాని పక్షమున ఆయభివృద్ధిభాగము ఆస్తితోగూడ వానికి ఒప్పగింతచేయవలయును. కాని సదరు ఆస్తిని నశించిపోకుండను, దండుగ క్రిందికి రాకుండను, లేక విక్రయము కాకుండను, కాపాడగలందులకు అభివృద్ధి పయి

స్వామ్యము పరివర్తనము అయినందువలన చెందిన అభివృద్ధి.

పబడినదేదో దానిని దేనినయిన పొందుట ఆవశ్యకముగ ఉండి అలాగు పొందు విషయములోగాని తాకట్టుంచువాని అనుమతిమీద ఆ యభివృద్ధిని పొందు విషయములోగాని, తాకట్టుంచువాడు అందుకు తగులుబడిఅయిన క్రమ వ్యయమును, అసలు సొత్తుతోగూడ ఆ వడ్డీవంతుననే చెల్లించుటకు జవాబుదారుడగును.

కడపట చెప్పిన విషయములో ఆయాభివృద్ధివలననుండి వచ్చు లాభము లేమయిననుండినచో వానిని తాకట్టుంచువాని లెక్కలో జమకట్టవలయును.

ఆ తాకట్టు భోగ్యపు తాకట్టు అయి ఆయభివృద్ధి బాబతు తగులుబడికి తాకట్టుంచుకొన్నవాడే పెట్టుకొని సంపాదించిన విషయములో ఆయభివృద్ధివలన గలుగులాభములను, అన్యధా కరారులేనిచో, అట్టి ఖర్చుపెట్టిన సొమ్మునకు చెల్లింపదగు వడ్డీకిగాను చెల్లు పెట్టవలయును.

తాకట్టు గుత్తను మరల పుట్టించుకొనుట.

౬౪. తాకట్టు ఆస్తి కొన్ని సంవత్సరముల దాకనుండు గుత్త అయియుండి తాకట్టుంచుకొన్నవాడు ఆ గుత్తను మరల పుట్టించునట్టి విషయములో తాకట్టు విడుదల అయినమీదట తాకట్టుంచువాడు, అన్యధా కరారులేనిచో, క్రొత్త గుత్తయొక్క లాభమును పొందును.

తాకట్టుంచువాడు ఊహించినట్లు ఎన్నబడు కరార్లు.

౬౫. అన్యధా కకారు లేనిచో, తనఖావుంచువాడు తనఖావుంచుకొన్న వానితో—

(ఏ) తనఖావుంచువాడు తనఖావుంచుకొన్నవానికి పరివర్తనచేయుదునని చెప్పు హక్కు వున్నదనియు దానిని పరివర్తనచేయుటకు తనఖావుంచువానికి అధికారము కలదనియు;

(బి) తనఖా వుంచువాడు తనఖా ఆస్తిపయిన తనకుగల బాధ్యతను కాపాడుననియు లేక ఆ యాస్తి తనఖావుంచుకొన్న వాని స్వాధీనములోనున్న పక్షమున ఆ బాధ్యతను కాపాడుకొనుటకు అతనికి సహాయము చేయుననియు;



(సి) తాకట్టు ఆస్తి తనఖావుంచుకొన్నవాని స్వాధీనములోకి రానంతవఱకు ఆయాస్తిపైనగలుగు సర్కారు ఖర్చులనన్నిటిని తనఖావుంచువాడు చెల్లించుననియు;

(డి) తనఖా ఆస్తి కొన్ని సంవత్సరములవఱకుండు గుత్త అయియుండు విషయములో, తనఖా ప్రారంభమగుదాక ఆ గుత్తనుబట్టి చెల్లింపదగిన బాడుగలను చెల్లించి అందులోచెప్పబడిన షరతులను నెఱవేర్చి గుత్తకాడు చేయవలయు కరార్లు కొనసాగింపబడినవనియు; తనఖా తీరకుండునంతదాకను, తనఖా ఆస్తి తనఖావుంచుకొన్నవాని స్వాధీనమందు లేకుండునంతదాకను, గుత్తనుబట్టికాని, లేక గుత్త క్రొత్తగా జేకొనబడు పక్షమందు అట్లు క్రొత్తగా జేకొనబడిన గుత్త మూలముగ గాని, ఏర్పడియున్న బాడుగను తాట్టుంచువాడు చెల్లించి అందులోచెప్పియున్న షరతులను నెఱవేర్చి గుత్తకాడు నెఱవేర్పవలయు కరార్లను నెఱవేర్చునదిగాక సదరు బాడుగను చెల్లింపనందువలననయినను లేక సదరుషరతులను కరార్లను నెఱవేర్పనందువలననయినను లేక లక్ష్యపెట్ట నందువలననయినను కలిగిన దావాచిక్కుల అన్నిటినుండియు, తాకట్టుంచుకొన్నవానిని విమోచనము చేయుననియు;

(ఇ) తాకట్టు ఆ యాస్తిమీద రెండవ తగాదాగాగాని లేక తర్వాతి తగాదాగాగాని అయియుండు సంగతిలో; మొదటిప్రతి తగాదామీదను అప్పటప్పటికి అగువడ్డీని ఎప్పుడెప్పుడు బాకీ అగునో అప్పుడప్పుడే తనఖావుంచువాడు చెల్లించుననియు, అట్టి మొదటి తగాదామీద ఇయ్యవలయు అసలు పయికమును సరియయిన కాలమందు చెల్లించుననియు;

కరారు చేయునట్లు తలంపవలయును.

(సి) క్లాజులోను లేక (డి) క్లాజులోను ఉండినది ఏదియు రాబోవు బాడుగను చెల్లించుటకు సంబంధించునంతవఱకు భోగ్యపు తాకట్టువిషయములో చెల్లుబడికానేరదు.

ఈ సెక్షనులో ఉదాహరింపబడిన గుత్తల ప్రయోజనము తనఖా వుంచుకొన్నవాని హక్కుతో జేర్పబడి దానిని అనుసరింపవలసినదే గాక, ఆ హక్కు అందుల యావత్తు పయిన గాని కొంత పయిన గాని అప్పటప్పటికి ఎవనికి గలుగ జేయబడుచున్నదో అట్టి ప్రతి మనుష్యుని వలనను చెల్లాయింపబడవచ్చును.

౬౬. తాకట్టు ఆస్తిని తన స్వాధీనమందు గల తాకట్టుంచువాడు ఆయాస్తిని క్షీణించి పోనిచ్చినందుకు తాకట్టుంచుకొన్నవానికి జవాబుదారియయి ఉండడు. కాని సదరు తాకట్టు చాలనిదిగా నున్న యెడల గాని లేక నాశము అయినను హానియైనను కలుగ జేయునట్టి ఏదయిన కార్యము మూలముగ చాలనిదిగా జేయబడు నెపలను గాని, అతడట్టి కార్యమును అందుకుగాను చేయగూడదు.

స్వాధీనము తనయందే ఉంచుకొని తాకట్టుంచువానిచే కలుగు నష్టము.

వివరణము.— తనఖా ఆస్తియొక్క కిమ్మతు తాకట్టుమీద తత్కాలమందు చెల్లింపవలయు మొత్తమునకు మించి మూటనొకపాలు లేకపోయినను, లేక దానిలో ఇండ్లువున్న పక్షమందు ఆ బాకీ మొత్తమునకు మించి సగము లేకపోయినను, ఈ సెక్షనుయొక్క తాత్పర్యప్రకారము తాకట్టు చాలినదయి యుండదు.

తాకట్టుంచుకొన్నవాని హక్కులును జవాబుదారీలును.

౬౭. అన్యథా కరారు లేనిచో, తాకట్టు ధనము తాకట్టుంచుకొన్నవానికి చెల్లింపదగినది అయిన తర్వాతను, తాకట్టు ఆస్తిని విడిపించుకొనుటకు డిక్రీ చేయుటకు గాని లేక ఈ క్రింద చెప్పిన ప్రకారము తాకట్టు ధనమును చెల్లించుటకు గాని లేక అనామతుగా ఉంచుటకు గాని పూర్వమందును ఏ కాలమందయినను ఆయాస్తిని విడిపించుకొనుటకు తాకట్టుంచువానికి గల హక్కు పూర్ణముగ అభ్యంతరము కలుగవలయునను ఉత్తరువును

అవధిక్రయమునకు లేక విక్రయమునకు హక్కు.



గాని ఆయాస్తిని విక్రయింపవలయునను ఉత్తరువును గాని, కోర్టువారివద్దనుండి పొందుటకు తాకట్టుంచుకొన్నవానికి హక్కు కలదు.

తాకట్టు ఆస్తిని విడిపించుకొనుటకు తాకట్టుంచువానికి గల హక్కు పూర్తిగా అభ్యంతరము కలుగవలయునను వుత్తరవును పొందుటకు తెచ్చు వ్యాజ్యము అవధిక్రయవ్యాజ్యమని చెప్పబడును.

ఈ సెక్షనులోనున్న దేనిని —

(ఏ) వట్టి తాకట్టుంచుకొనువానిని ఆ యోగ్యతమీద అవధిక్రయమునకు వ్యాజ్యము దాఖలు చేయుటకు గాని లేక భోగ్యపు తాకట్టుంచుకొన్నవానిని ఆ యోగ్యతమీదనె అవధిక్రయమునకు లేక విక్రయమునకు వ్యాజ్యము దాఖలు చేయుటకు గాని లేక, షరతుబద్ధమగు విక్రయభావనెపల తాకట్టుంచుకొన్నవానిని ఆ యోగ్యతమీదనె విక్రయమునకు వ్యాజ్యము తెచ్చుటకు అధికారమిచ్చునట్లును; లేక

(బి) తాకట్టుంచుకొన్నవాని హక్కులను అతని ట్రస్టీగా గాని ధర్మశాస్త్రసమ్మతమగు అతని ప్రతినిధిగా గాని ఉండి స్వాధీనమందు గలిగినట్టియు సదరు ఆస్తిని విక్రయించుట కొఱకు వ్యాజ్యము తేకలిగినట్టియు తాకట్టుంచు వానికి అవధి క్రయమునకు గాను వ్యాజ్యము తెచ్చుట కధికారమిచ్చునట్లును;

(సి) దేనిని నిర్వహించుటయందు జనులు సంబంధపడియున్నారో అట్టి యినుపదారిని గాని కాలువను గాని లేక ఇతరమయిన పనిని గాని తాకట్టుంచుకొన్నవాడు అవధిక్రియమును గుఱించి గాని విక్రియమును గురించి గాని వ్యాజ్యము తెచ్చుటకు అధికారము కలుగ జేయునట్లును;

(డి) తాకట్టుంచువాని యనుమతి పుచ్చుకొని తాకట్టుంచుకొన్నవారు ఆ తాకట్టుమీది హక్కులను విడతీసియుండిననే తప్ప, తాకట్టు ధనములోని కొంతభాగముమీదనే హక్కుగలవానిని తాకట్టు ఆస్తిలో దానిసమ

భాగమునుగుఱించియే వ్యాజ్యెమును తెచ్చుటకును అధికారము కలుగజే యునట్లును;

గ్రహింపగూడదు.

౬౮. తాకట్టుంచుకొన్నవాడుతనఖాధనములకుగాను ఈక్రింది విషయ

తనఖాధనమునకుగాను దావా తెచ్చుటకుహక్కు.

ములలో మాత్రమే తాకట్టుంచువానిమీద వ్యాజ్యెము తెచ్చుటకు హక్కు గలిగియుండును:—

(ఏ) దానినేమరల చెల్లించుటకుగాను తాకట్టుంచువాడు బద్ధుడైయుండునెడలను:

(బి) తాకట్టుంచువాడుఅక్రమకార్యమును చేయుటవలనగాని లేక చేసినమీదటగాని లేక చేయవలయుదానిని చేయక ఉపేక్షచేసినందువలనగాని తాకట్టుంచు కొనువానికి తనకుగల తాకట్టు యావత్తుగాని లేక కొంత భాగముగాని లేకుండ హరింపజేయునెడలను:

(సి) తాకట్టుంచుకొన్నవాడు ఆ యాస్తియొక్క స్వాధీనమునకు హక్కుకలిగియుండగా తాకట్టుంచు వాడుగాని లేక ఇతర మనుష్యుడుగాని చేయు క్రమలేకుండనే దానిని వానికి ఒప్పగించివేయకుండనయినను లేక వానికి స్వాధీన పఱుపకుండ నయినను సదరు తాకట్టుంచువాడు తప్పిపోవునెడలను.

తనఖావుంచువాడుగాని లేక తనఖావుంచుకొన్నవాడుగాని అక్రమకార్యము చేయుటవలనగాని లేక చేయవలయు దానిని చేయక తప్పిపోవుటవలనగాని కాకుండ, ఏదయిన ఇతరకారణమువలన తనఖాఆస్తియావత్తుగాని కొంత భాగముగాని నశింప జేయబడి ౬౬ రో సెక్షనులో నిర్వచించిన ప్రకారము తనఖా చాలనిదిగా నున్న యెడల తనకు చెల్లింపవలయు ఋణమునకుగాను తగుమయిన కాలములోగ యుక్తమయిన మఱియొక తనఖాను పెట్టుమని తనఖావుంచుకొన్నవాడు తనఖావుంచు వానిని కోరవచ్చును. తనఖావుంచువాడు ఆలాగుపెట్టక తప్పిపోవుపక్షమందు తనఖాధనమునకుగాను అతనిమీద వ్యాజ్యము తేవచ్చును.



౬౯. తనఖాధనమును చెల్లింపక ఉపేక్ష చేయునెడల తనఖా ఆస్తిని గాని అందలియేభాగమునయినగాని కోర్టువారి జోక్యము లేకుండనే విక్రయించుటకయినను, లేక విక్రయమునకు సమ్మతించుటకయినను తనఖా

విక్రయాధికార మెప్పుడు చెల్లునది.

పత్రమువలన తనఖావుంచుకొన్న వానికి లేక వానితరఫున ఎవ్వనికయిన కలుగజేయబడిన అధికారము, ఈక్రింద చెప్పబడిన సంగతులలో చెల్లుబడి యగును, మఱియు ఇతరసంగతులలో పేనియుండును చెల్లుబడి కాదు, అసంగతు లేవనగా :—

(ఏ) ఆ తాకట్టు యింగ్లీషు తాకట్టుఅయి తాకట్టుంచువాడుగాని లేక తాకట్టుంచుకొన్నవాడుగాని హిందువుగానయినను, మహమ్మదీయుడుగానయినను లేక బౌద్ధుడుగానయినను ఉండనప్పుడు, లేక దీని [illegible] ప్రదేశగవర్నమెంటువారు ఆలోచనసభలోని గవర్నరుజనరలుగారి ([illegible]క్షను) అంగీకారము ముందుగా పొంది ప్రదేశ సర్కారు గెజెటులో అప్పుడప్పుడు నిర్దేశించునట్టి యితర జాతిలోగాని వర్ణములోగాని మతములోగాని తరగతిలోగాని చేరని వేఱొకడయినప్పుడును;

(బి) తాకట్టుంచుకొన్నవాడు ఆలోచన సభలోని ఇండియా సేక్రటరీ స్టేటు సెక్రిటెరిగా నుండునప్పుడును;

(సి) తాకట్టు ఆస్తియైనను లేక అందలిభాగమేదియయినను కలకత్తా, మదరాసు, బొంబాయి, కరాచి, రంగూను పట్టణములలో నుండునప్పుడును.

కాని అట్టి అధికారము —

(౧) అసలు పయికమును చెల్లించుటకు తాకట్టువుంచువానికిగాని లేక తాకట్టు వుంచువారిలో ఒకనికిగాని లిఖితమూలమగు నోటీసును జారీచేసి ఆలాగు జారీచేసిన తరువాత మూడు మాసములవఱకు [illegible] నయినను లేక అందలి భాగమునైనను చెల్లింపక తప్పిపోయిన [illegible] తప్పిపోవువఱకును, లేక

(౨) తాకట్టుబాబతుకనీసము అయిదువందల రూపాయిలదాక అగు కొంతవడ్డీ బాకీగావుండి అట్లుబాకీపడిన మూడు మాసములవఱకు చెల్లింపబడక పోయిననేతప్ప లేక చెల్లింపబడకుండు వఱకును,

చెలాయింపగూడదు.

అట్టి అధికారమును బాహాటముగా చెలాయించుచు విక్రయముచేయు నప్పుడు ఆప్రకారము విక్రయింపనధికారమిచ్చుటకు ఏ ప్రసక్తియు కలుగలేదనునట్టిగాని, లేక క్రమమయిన నోటీసు ఇయ్యబడలేదనునట్టిగాని, లేక ఆ యధికారము అన్యధా అక్రమముగా అవిధాయకముగా చెలాయింపబడినదనునట్టిగాని, కారణమును బట్టి కొన్నవానియొక్క హక్కు నిందాస్పదము కాగూడదు. అయినను సదరు అధికారమును వుత్తరువులేకుండగాని అక్రమముగాగాని అవిధాయకముగాగాని చెలాయించుటవలన నష్టమును పొందిన ఏమనుష్యునకయినను ఆయధికారమును చెలాయించినవానిపయిన ఆనష్టమును రాబట్టుకొనగలిగియుండవలయును.

ఏఋణముల కావిక్రయములోనైయుండ లేదో అట్టి ముందటి ఋణములు, ఏవైనయున్న యెడల, వానిని చెల్లించిన తరువాతగాని లేక యేదైన ముందటి ఋణమును వుపయోగించుటకుగాను ఒకమొత్తమును ౫౭ డో సెక్షనునుబట్టి కోర్టులో చెల్లించిన తరువాతగాని, ఆవిక్రయమును జరిగించి తాకట్టుంచుకొన్నవానివలన రాబట్టుకొనబడు పయికము, అన్యధా కరారులేనిచో, మొదట, సదరు విక్రయమునకుగాని లేక యత్నింపబడిన ఏవిక్రయమునకుగాని ఆవశ్యకమయి అతనికిన్యాయముగా తగులుబడియయిన ఖర్చులకును వ్రయములకును తగులుబడులకును చెల్లుగాను అటుతరువాత, తాకట్టుననుసరించి తాకట్టు ధనమును ఖర్చులు ఇంక యితరపయికము ఏదయిననున్నయెడల అందుకు చెల్లుగాను అతడు వుపయోగించులాగు ట్రిస్టుగా అతడు వుంచుకొనవలయును. మఱియు ఆలాగు పుచ్చుకొనబడిన పయికముయొక్క మిగతను తాకట్టు ఆస్తిపయి హక్కు కలిగియున్నట్టి



గాని, లేక దానిని విక్రయించుటవలన వచ్చు పయికమునకుగాను రశీదులు యిచ్చుటకు అధికారము కలిగియున్నట్టిగాని, మనుష్యునకు చెల్లింపవలయును.

ఈ సెక్షనుయొక్క మొదటిభాగమునందు వుండునది ఏదియు ఈఆక్టు అమలులోనికి రాకముందు కలుగజేయబడిన అధికారములకు వర్తింపదు.

౧౮౬౬లో సంవత్సరపు ట్రస్టీలయు తాకట్టుంచుకొన్న వారలయు అధికారముల ఆక్టులోని ౬ మొదలు ౧౯ వఱకుండు సెక్షనుల (రెండుగూడ) యందుండు అధికారములను నిబంధనలను తాకట్టుసొత్తు బ్రిటిష్ ఇండియాలో ఎక్కడ నున్నప్పటికిని తాకట్టుంచువాడుకాని లేక తాకట్టుంచుకొన్నవాడుకాని హిందువుగానయినను మహమ్మదీయుడుగానయినను బౌద్ధుడుగానయినను వుండనప్పుడును, లేక ఆలోచన సభలోని గవర్నరు జనరలుగారి శాంక్షనును - అంగీకారమును ముందుగా పొంది అప్పుడప్పుడు లోకల్ అఫిషియల్ గెజెట్లులో ప్రదేశగవర్నమెంటువారు నిర్దేశించునట్టి ఇతరజాతిలోగాని వర్ణములోగాని మతములోగాని తరగతిలోగాని చేరని వేఱొకడయినప్పుడు ఇంగ్లీసు తాకట్టుల విషయములో చెల్లుబడిఅగునట్లు గ్రహింపవలయును.

తాకట్టు సొత్తున కభివృద్ధి.

౭౦. తాకట్టుపెట్టిన తేదికి తర్వాత తాకట్టుఆస్తి అభివృద్ధిని దేనినైన చేసినపక్షమున, తాకట్టుంచుకొన్నవాడు, అన్యధా ఖరారులేనిచో, తాకట్టు కార్యములకుగాను అట్టిఅభివృద్ధినైన హక్కు కలిగి వుండవలయును.

## దృష్టాంతములు.

(౧) ఎ అనువాడు ఒక నదీ తీరమందున్న పొలమును బి అనువానికి తాకట్టు పెట్టును. ఆపొలము ఒండుపెట్టుటవలన అభివృద్ధిఅగును. తాకట్టు వ్యవహారములకుగాను బి అనువాడు ఆయభివృద్ధిపయిన హక్కు కలిగియుండును.

(బి) ఏ అనువాడు నివేశనమునకుగాను ఖాళీగానున్న స్థలమును బి అనువానికి తాకట్టుపెట్టి తర్వాత ఆస్థలమందు ఒక యింటిని కట్టును. తాకట్టు వ్యవహారములకుగాను బి అనువానికి ఆయింటిపయినను స్థలము పయినను హక్కు కలదు.

తాకట్టు గుత్తను మరల పుట్టించుకొనుట.

౭౧. తాకట్టుఆస్తికొన్ని సంవత్సరములవఱకుండు గుత్తఅయియుండి తాకట్టుంచువాడు, ఆగుత్తను మరల క్రొత్తగా పొందినప్పుడు ఆతాకట్టుంచుకొన్నవాడు, విరుద్ధముగా కరారు లేనిచో, ఆ తాకట్టు వ్యవహారములకొఱకు ఆక్రొత్తగుత్తపయిన హక్కు కలిగియుండును.

స్వాధీన తాకట్టుంచుకొన్నవానికి హక్కులు.

౭౨. సదరు తాకట్టు జరుగుచుండగ ఆతాకట్టు సొత్తును తాకట్టుంచుకొనువాడు స్వాధీనము చేసికొనునప్పుడు —

(ఏ) సదరు సొత్తును క్రమముగ నిర్వహించి దానిమీదవచ్చు అద్దెలను లాభములను వసూలుచేసికొనుటకును;

(బి) దానిని నాశము కాకుండగాని దంపుగ క్రిందికి రాకుండగాని లేక విక్రయింపబడకుండగాని నిలుపుటకును;

(సి) సదరుసొత్తుపైన తాకట్టుంచువానికి గలహక్కును రక్షించుటకును;

(డి) తాకట్టుంచువానికి పయిపోటిగ దానిపయిన తనకుగలహక్కును స్థిరపఱుచుకొనుటకును, మఱియు

(ఇ) తాకట్టుంచుసొత్తు క్రొత్తగ పుట్టింపదగిన గుత్తసొత్తు అయినప్పుడు, సదరుగుత్తను క్రొత్తగపుట్టించుటకును;

ఆవశ్యకమైయుండునంతసొమ్మును వాడువ్యయపెట్టవచ్చును.

మఱియు, అన్యథా కరారు లేనిచో, అసలుసొమ్ముకుగాను చెల్లింపదగిన వడ్డివంతునను అట్టి ఏ వంతును ఏర్పఱుపబడి యుండనప్పుడు సంవత్సరమునకు నూటికి ౯ వంతునను, అట్టిసొమ్మును అసలు సొమ్ముతో చేర్పవచ్చును.



ఆ సొత్తు స్వభావమునుబట్టి భీమాచేయదగియుండు సంగతిలో, తాకట్టుంచుకొనువాడు, అన్యథా కరారు లేనిచో, అట్టిసొత్తును యావత్తుగాని దానిలోనిభాగమును దేనినయినగాని అగ్నివలన నష్టమైపోకుండను లేక అపాయము పొందకుండను భీమాచేసి కాపాడుటయగాక ఆలాగు భీమాచేసి యుంచవచ్చును; ఆ ప్రాముఖ్యతతోడనే ఆ వంతువడ్డితోడనే అసలుసొమ్ముతోగూడ అట్లుభీమాచేసి కాపాడుటకుగాను చెల్లింపబడిన బయానాపయికములు సదరు తనఖా ఆస్థిమీద లెక్కగా వుండవలయును. కాని అట్టి భీమా మొత్తము తనఖాపత్రములో ఈవిషయమై నిర్దేశింపబడియున్న మొత్తమునకుగాని (అట్టి మొత్తము అందులో నిర్దేశింపబడియుండనియెడల) సదరుసొత్తు బొత్తిగా నశించిపోవుసంగతిలో భీమాచేసి కాపాడబడిన ఆస్తిని యథాస్థితిలో ఉంచుటకుగాను కావలసియున్న మొత్తములో మూటరెండు పాళ్లకుగాని మించియుండగూడదు.

తనఖా వుంచుకొనువాడు భీమాచేయులాగు ఇందువలన అధికారము కలుగజేయబడిన మొత్తమువఱకు ఆ ఆయాస్తి సంబంధమగు భీమాను తాకట్టుంచువాడు తానుగాగాని తనపక్షమునగాని చేసియున్నప్పుడు, ఈసెక్షనులో ఉండునది ఏదియు తనఖా వుంచుకొనువాడు భీమాచేయులాగు అధికారము కలుగజేయునట్లు గ్రహింపబడగూడదు.

రివిన్యూ విషయిక విక్రయపు పైకముమీదగల పూచీ (చార్జి.)

౭౩. తనఖా అస్తిపయిన గలుగు సర్కారుతీరువ బాకీగాని దానికికట్టవలయు అద్దెనుగాని చెల్లింపకుండ తప్పిపోవుటవల్ల ఆయాస్తి విక్రయింపబడు సంగతిలో, తనఖా వుంచుకొనువాడు అట్లు తప్పిపోవుట వలన విక్రయమునకు ఆస్పదమయ్యుండిననే తప్ప సదరు విక్రియమువలన వచ్చు రాబడిలోనుండి సదరు బాకీని చెల్లించినతర్వాత అందులో ఏమైన మిగతవున్నయెడల అదితనఖామీద బాకీగావున్న మొత్తమునకుగాను దానిపైన తాకట్టుంచుకొనువానికి బాధ్యతకలదు.

ముందటి తనఖావుంచుకొన్నవాని బాకీని చెల్లించివేయుటకు తర్వాతి తాకట్టుంచుకొన్నవాని హక్కు.

౭౪. రెండవసారి తాకట్టుంచుకొనువాడెవడయినగాని లేక తర్వాత తాకట్టుంచుకొను అన్యుడుగాని అవతలి మొదటి తాకట్టుమీద బాకీవున్నమొత్తము చెల్లింపదగినదైన తర్వాత ఎప్పుడయినను మొదట తనఖావుంచుకొనువానికి అట్టిమొత్తమును చెల్లింపవచ్చును. అట్లు తనఖా వుంచుకొనువాడు అలాగున చెల్లించినమొత్తమును అంగీకరించి అట్టి మొత్తమును చెల్లించినట్లు రసీదు ఇచ్చుటకును బద్ధుడయియుండును. మఱియు (దస్తావేజులను రిజిస్టరుచేయుట క్రమపఱుచుటనుగుఱించి తత్కాలమందు అమలులోవున్న ధర్మశాస్త్రములోని నిబంధనకులోనై) తర్వాత తనఖా వుంచుకొనువాడు అట్టి రసీదునుపుచ్చుకొన్నమీదట ఎవరికి ఆప్రకారముగా ఇచ్చెనో ఆతాకట్టుంచుకొనువాడుగా అతనియొక్క యావత్తు హక్కులను అధికారములను సదరు ఆస్తిపయిన పొందవలయును.

ముందటి తనఖా వుంచుకొన్న వానిమీదను తర్వాతితనఖావుంచుకొన్న వానిమీదను మధ్యతనఖావుంచుకొన్నవానికిగల హక్కులు.

౭౫. రెండవసారిగాని లేకతర్వాతగాని తనఖా వుంచుకొనువాడుప్రతివాడును తనఖా ఆస్తిని విడుదలచేయు సంగతిలోను అవధిక్రయముచేయు సంగతిలోనువిక్రయించు సంగతిలోను సంబంధపడు నంతవఱకు మొదటిసారి తాకట్టుంచు కొనువానిమీద, లేక వారిమీద అతనికితాకట్టుంచువానికి అట్లు మొదటిసారి తాకట్టుంచు కొనువానిమీద లేక వారిమీద ఎట్టిహక్కు లుండునో అట్టి హక్కులను, తర్వాత తాకట్టుంచుకొనువారు (ఎవరైన నుండునెడ) వారిమీద - అతనికి తన తాకట్టుంచువానిమీద ఎట్టి హక్కులుండునో అట్టి హక్కులను, గలిగియుండును.

స్వాధీన తనఖా వుంచుకొన్నవాని జవాబుదారీలు.

౭౬. తనఖా జరుగుదలలోనుండగ తనఖా ఆస్తిని తనఖావుంచుకొనువాడు స్వాధీనపఱుచుకొనునప్పుడు,——



(ఎ) సామాన్య జ్ఞానవంతుడగు వాడు సదరు ఆస్తిని తనసొంతమయియుండు పక్షమున ఎట్లువిచారించుకొనునో అట్లు సదరు ఆస్తిని విచారింపవలయును.

(బి) దానిమీదవచ్చు అద్దెలను లాభములను వసూలు చేయుటకుగాను ఉత్తమ ప్రయత్నములను చేయవలయును;

(సి) సదరు ఆస్తిమీది వచ్చురాబడినుండి, అన్యథా కరారులేనిచో, సదరు ఆస్తిని అట్లుస్వాధీనములోనుండగ దానిమీదబాకీపడునట్టి రివిన్యూను, ఇతర తగులుబడులనన్నిటని, దేనికిగాను సదరు ఆస్తిని తక్షణమే అమ్మబడునో అట్టి యద్దెబాకీలను చెల్లింపక తప్పిపోవుటకు కారణమగు ఏ అద్దెబాకీలనయిన, సర్కారువారికి చెల్లింపవలయును;

(డి) సదరు అద్దెలనుండియు లాభములనుండియు (సి) క్లాజులో చెప్పబడినట్లు చెల్లించినపయికములను అసలు పయికముమీద వడ్డీని తీసివేసిన తర్వాత సదరు అద్దెనుండియు లాభమునుండియు తాను చెల్లింపగలిగియుండు పయికమునుపెట్టి ఆస్తికి ఆవశ్యకమైయుండు మరమ్మతులను అన్యథా కరారులేనిచో, వాడుచేయవలయును;

(ఇ) సదరు ఆస్తిని నాశముచేయునట్టికాని లేక దానికి శాశ్వతముగ అపాయకరమగునట్టికాని ఏ కార్యమును వాడు జరిగింపగూడదు;

(యఫ్) సదరు ఆస్తిని యావత్తుగాని అందలి ఏ భాగమునుగాని అగ్నివలని నష్టమునుండికాని అపాయమునుండికాని తప్పించుటకు భీమాచేసియుండు సంగతిలో, అట్టి నష్టముకాని అపాయముకాని సంభవించు సందర్భమున, సదరు భీమాను అనుసరించి తనకువాస్తవముగ వచ్చునట్టి ఏపయికమునైనను లేక ఆవశ్యకమగునంత మాత్రమునయినను దానిని యథాస్థితికి తెచ్చుటకు వాడు ఉపయోగపఱుపవలయును; లేక తాకట్టుంచువాడు ఆప్రకారము కోరినపక్షమున సదరు పయికమును సదరు తాకట్టుధనమును తీర్చివేయుటకుగాని లేక తగ్గించుటకుగాని ఉపయోగింపవలయును;

(జి) తాకట్టుంచుకొనువాడుగా నుండినందువలన తానురాబట్టుకొని వ్యయపెట్టిన మొత్తములనుగుఱించి స్పష్టమయినట్టియు పూర్ణమయినట్టి యయు సరియయినట్టియు లెక్కలను వాడు ఉంచవలయును; మఱియు స దరు తాకట్టు జరుగుదలలో నుండునపుడు ఎప్పుడయినను అట్టిలెక్కలకు ను అవి వేనివలన సమర్థింప బడుచున్నవో ఆనిర్ధారణ పత్రికలకును నిజము యిన ప్రతులను అతడు కోరినమీదట వానితగులుబడిమీదను, తాకట్టుంచు వాని కియ్యవలయును;

(ఎచ్) తాకట్టు సొత్తుమీద వచ్చురాబడిని, లేక అట్టిఆస్తి తానుస్వయ ముగనే ఆధీనముచేసికొని యున్నపక్షములో (సి), (డి) క్లాజులలోచెప్ప బడిన తగులుబడులను, వానిమీద అగువడ్డిని తీసివేసిన తర్వాత, సదరుతా కట్టు ధనముమీది వడ్డికిగాను, అప్పుడప్పుడు అగునట్టి బాకీ మొత్తమునకు, ఏదయిన నున్నయెడల, చెల్లుగను అట్టి వరవులు బాకిగానున్న వడ్డికి ఎంత వఱకుమించునో దానిని, తాకట్టు ఋణమును తీర్చుటకు చెల్లుగాను, వాని మీద ఖర్చు వ్రాయవలయును; మిగత యేదయిన నున్నయెడల దానిని తా కట్టుదారునికి చెల్లింపవలయును;

(ఐ) తాకట్టుమీద తత్కాలమునకు బాకిగా నుండు మొత్తమును తా కట్టుంచువాడు ఇయ్యవచ్చినపుడుకాని లేక ఇకముందు ఏర్పాటుచేసిన విధ మున అనామతు చేసినపుడుకాని ఈ సెక్షనులోని క్లాజులలో ఏమి చెప్పి యుండినను నిమిత్తములేకుండ, అట్లు సదరుమొత్తమును ఇయ్యవచ్చిన తేది మొదలుకొనికాని లేక కోర్టువారివద్దనుండి అట్టి యొత్తమును అతడెప్పుడు చేకొనగలిగి యుండునో అట్టి కాలప్రారంభము మొదలుకొనికాని సంద ర్భప్రకారము సదరుతనఖా ఆస్తివలననుండి వచ్చురాబడి వసూళ్లకుగాను తనఖావుంచుకొనువాడు సమాధానము చెప్పవలయును.



అతనిలోపమువలన సం భవించిన నష్టము.

ఈ సెక్షనునుబట్టి తాను నెఱవేర్పవలయు విధులలో దేనినయిన నెఱ వేర్పక తనఖా వుంచుకొను వాడు తప్పి పోయిన పక్షమున, ఈ యధ్యాయము ననుసరించిచేయ బడు డిక్రీప్రకారము లెక్కలను తీసికొనునప్పుడు, అట్లు తప్పి పోవుటవలన సంభవించు నష్టమేదైన నుండినచో దానిని అతని లెక్కలో కట్టి వ్రాయవలయును.

వడ్డికిబదులు వచ్చుబళ్లు.

౭౭. ౭౬రో సెక్షను (బి), (డి), (జి), (ఎచ్) క్లాజులలోనుండునటు వంటి దేదియు సదరు తనఖా ఆస్తివలన నుండి వచ్చువసూళ్లను, తనఖావుంచువానికి సదరుఆస్తి స్వాధీనమయి యున్నంతవరకు సదరు అసలు పయికముమీది వడ్డికి బదులు గాగాని లేక అట్టి వడ్డికిని అసలులోని నిర్వాచ్య భాగములకును బదులుగా గాని తీసికొనవలయునట్లు తనఖావుంచుకొనువానికిని తనఖావుంచువానికిని కరారు వుండు విషయములలో ప్రయోగపడదు.

ప్రధమత్వము.

ముందటి తాకట్టుంచు కొన్నవాని (హక్కు కొంత దాక) నిలుపుదలయగుట.

౭౮. ముందటి తనఖా వుంచుకొనువాని మోసము మూలముగగాని లేక వాడు సంగతినితప్పుగా జెప్పుట మూలముగ గాని లేక అతి నిర్లక్ష్య మూలముగగాని సదరు తాకట్టు ఆస్తిభద్రముగా నుండుటకొఱకు సైక మును ముందుగా అడ్వాన్సు చేయునట్లుగా ఇతర మనుష్యుడు చేయబడినపుడు ముందటి తనఖా వుంచుకొనువానిబాధ్యత త ర్వాత తనఖా వుంచుకొనువాని బాధ్యత చెల్లుట కొఱకు నిలుపుదల చేయ బడవలయును.

సర్వాధికపు మొత్తను తెలియ జేయబడి నపుడు

౭౯. రాగల అడ్వాన్సు పయికములనుగాని ఒడంబడికను నెఱవేర్చు టనుగాని అమలులో నున్న లెక్కలోని మిగత పయికమునుగాని భద్రపఱుచుటకు పెట్టబడిన

ఏదో యొక నిష్కర్ష లేని మొత్తమునకు ఈడుకుగాను తాకట్టు.

తనఖాలో అట్లుదానివలన భద్రపఱుపవలయు సర్వాధికపు మొత్తమును చెప్పిన పక్షమున, ఆ యాస్తిమీదనె పెట్టబడిన తర్వాతి కుదువ దానికున్న ముందటి తనఖా సంబంధములగు పరమాధికపు మొత్తమునకు మించని అడ్వాన్సులయు జమలెక్కలయు విషయమై తర్వాతి తనఖానుగురించి నోటీసు ఇచ్చికాని లేక నోటీసు ఉండినచో సెలవును ఇచ్చిగాని వుండినప్పటికి ఆ యాస్తిమీదనె తర్వాత పెట్టబడిన తాకట్టు బాధ్యతను ముందుగా పెట్టబడిన తనఖా బాధ్యత చెల్లుబడియగుటకొఱకు నిలుపవలయును.

దృష్టాంతము.

ఎ అనువాడు తన సాహుకార్లయిన బి సంఘమువారి వద్ద తన పేరట లెక్కలోని ౧౦,౦౦౦ రూపాయలదాకనుండు నిలువ బాకీకిగాను ఈడుగ వారికి సుల్తానుపూరును తాకట్టు పెట్టును. తర్వాత ఎ అనువాడు ౧౦,౦౦౦ రూపాయలకుగాను నమ్మకము పుట్టించుటకు సదరు సుల్తానుపూరును సి అను వానికి తాకట్టు పెట్టును. సి అనువాడు సదరు ఊరు బి సంఘమువారికి తాకట్టుగా నున్నట్లు నోటీసువలననివిని సదరు రెండవ తాకట్టును గుఱించి బి సంఘమువారికి నోటీసును ఇచ్చును. రెండవ తాకట్టు తేదికి బి సంఘమువారికి బాకీపడు మొత్తపునిలవ ౫,౦౦౦ రూపాయలకంటె ఎక్కువ అయియుండదు. తర్వాత ఎ అనువానికి అతనిమీదనుండు లెక్కలోని నిలవను ౧౦,౦౦౦ రూపాయల మొత్తముకంటే ఎక్కువ యగునట్లు బి సంఘమువారు మొత్తములను అడ్వాన్సు చేయుదురు. బి సంఘమువారు ౧౦,౦౦౦ రూపాయల పరిమితిదాక సి అనువానికంటె ముందటి బాధ్యత కలిగియుందురు.

౮౦. పూర్వోత్తరపు తాకట్లకు మధ్య పెట్టబడు తాకట్టు విషయమయి

"టాకింగ్" పద్ధతిని ఎత్తివేయుట.

నోటీసు ఉండినను లేకున్నను ముందటి తనఖాకుగాను ఉండుబాకీని చెల్లించివేయునట్టి ఏ తనఖా వుంచుకొను వాడయినను వాని పూర్వపు బాధ్యతను గూర్చి దానివలన నెట్టి ప్రథమ బాధ్యతనయినను పొందగూడదు. మఱియు ౭౯దో సెక్షనులో ఏర్పాటుచేసిన విషయములోదప్ప పూర్వోత్తరపు తాకట్లకు మధ్యనుండు తనఖావిషయమయి నోటీసువుండినను లేకున్నను తనఖావుంచువానికి ఉత్తరాడ్వాన్సు చేయునట్టి ఏ తాకట్టుంచుకొనువాడును అట్టి ఉత్తరాడ్వాన్సుకుగాను ఏర్పఱిచిన ఈడును అట్టి ప్రథమ బాధ్యతను పొందగూడదు.



(ఈడులను) క్రమపఱుచు పద్ధతియు పైకము చెల్లించు పద్ధతియు.

౮౧. రెండు సొత్తులకు ఖామందయినవాడు ఆ రెంటిని ఒక్కనికే తాకట్టుపెట్టి అటు తర్వాత ఆసొత్తులలో ఒకటిని

ఈడులను క్రమపఱుచుట.

మొదటి తాకట్టువిషయమయి నోటీసును పొందియుండని వేఱొక్కనికి తాకట్టు పెట్టినపక్షమున, దానికన్యథా కరారులేనిచో, సదరు రెండవసారి తాకట్టుంచుకొనువాడు ఆసొత్తు ఎంతవఱకు వ్యాపించి యుండునో అంతవఱకును, మొదటి సొంగి తాకట్టుంచుకొనువానియొక్క కాని లేక రెండుసొత్తులలో ఏదో ఒకదానిపయిన విశేష కిమ్మతుల ప్రతిఫలము ద్వారా బాధ్యత సంపాదించిన ఇకనే యితర మనుష్యుని యొక్క కాని హక్కులకు ఏ ప్రకారమునయిన బాధకము లేకుండునో ఆప్రకారమునను, మొదటిసారి తాకట్టుకొనువానికియ్యవలయు బాకిని రెండవసారి తాకట్టుంచుకొను వానికి తాకట్టు పెట్టనటువంటి సదరు సొత్తులోనుండియె తీర్చివేయవలయును.

౮౨. వివిధసొత్తులు వివిధయజమానులకు చెందియున్నను లేక ఒకనికే చెందియున్నను ఒక ఋణమునకేయి తాకట్టుపెట్టిన విషయములో, అన్యథా కరారు లేనిచో, అట్టిసొత్తులు తాకట్టు తేదిని దానికి లోనైయుండునో అట్టి ఏయితర అప్పుమొత్తమునయిన సదరు ప్రతిసొత్తు కిమ్మతునుండియు తీసి వేసిన తర్వాత, తాకట్టు పెట్టబడిన ఋణమునకుగాను

తనఖా ఋణమునకు పైకము చెల్లించుట.

చెల్లించి దానిని తీర్చివేయుటకు అర్హములై యుండును.

ఒక యజమానునికే చెందియున్న రెండు సొత్తులలో నొకదానిని ఒక ఋణమునకుగాను తాకట్టు పెట్టి తర్వాత రెంటిని వేఱొక ఋణమునకుగాను తాకట్టుపెట్టి మొదటిఋణమును మొదటిసొత్తు మూలముగ చెల్లించివేసినపుడు, ప్రతిసొత్తు, అన్యధా కరారులేనిచో, సదరు మొదటి అప్పు దేని మూలముగ చెల్లింపబడినదో ఆసొత్తుకిమ్మతులోనుండి మొదటి అప్పు మొత్తమును తీసివేసిన తర్వాత రెండవ అప్పునకుగాను తరమువారిని చెల్లించి తీర్చివేయుటకు అర్హమైయుండును.

రెండవ సారి తాకట్టుంచుకొనువాని బాధ్యతకుగాను ౮౧ టో సెక్షనునుబట్టి లోనయియున్న సొత్తుకు ఈ సెక్షనులో నుండున దేదియు ప్రయోగపడదు.

## కోర్టులో అనామతువుంచుట.

తాకట్టుమీదబాకీగానున్న పయికమును కోర్టులో అనామతు ఉంచుట కధికారము.

౬౩. అసలు పయికము చెల్లింపదగినది అయినతర్వాతను, తాకట్టుసొత్తును విడిపించు కొనుటకయి దావాహక్కునకు కాలదోషము బట్టకమునుపును, ఎప్పుడయినను, తాకట్టుంచు వాడుకాని లేక అట్టిదావాను తెచ్చుటకు హక్కుగల యికనే యితరమనుష్యుడుకాని తాను అట్టి దావాను ఏ కోర్టులో తెచ్చియున్నాడో ఆ కోర్టులో ఆతాకట్టు బాబతు బాకిగా మిగిలియున్న మొత్తమును, తాకట్టుంచుకొనువాని లెక్కలో చెల్లు పెట్టించుటకు గాను అనామతుగా (డిపాజిట్) ఉంచవచ్చును.

తనఖా వుంచువానివల్ల అనామతుగా పెట్టబడ్డపైకమునకు హక్కు.

అందుమీదట కోర్టువారు ఆయనామతువిషయమై లిఖితమూలమయిననోటీసును తాకట్టుంచు కొనువానికి జారీచేయవలయును. మఱియు (ప్లెయింటులను రూఢీచేయుటకుగాను పుట్టిన చట్టములో విధించినప్రకారము రూఢీచేయబడిన) పిటీషనును, తాకట్టుమీద అప్పటికి బాకి అయియున్న మొత్తమును పూర్ణముగ చెల్లించి తీర్చివేయుటకయి అట్లు అనామతుచేసిన పైకమును తీసికొనుటకు అతనికిగల యిష్టమును వివరించుచు యిచ్చినమీదటను, అప్పటికి తాకట్టు పత్రము తన స్వాధీనములోగాని అధికారములోగాని ఉన్న పక్షమున తాకట్టుపత్రమును ఆకోర్టులోనే అనామతు చేసిన మీదటను, తాకట్టుంచుకొను వాడు సదరు పైకమునకయి దరఖాస్తు పెట్టుకొని దానిని రాబట్టు కొనవచ్చును. అట్లు అనామతు చేయబడిన తాకట్టు పత్రమునుతాకట్టుంచువాని పరముగగాని లేక పయిన చెప్పినట్లు వేఱొకమనుష్యుని పరముగగాని ఒప్పగింతచేయవలయును.

వడ్డి నిలిచిపోవుట.

౬౪. తాకట్టుంచువాడుగాని లేక పయినచెప్పబడిన అట్టి యితరమనుష్యుడుగాని ౮౩డో సెక్షనునుబట్టి తాకట్టుమీద బాకీగా మిగిలియున్న మొత్తమును కోర్టులో ఇయ్యవచ్చికాని లేక అనామతుచేసికాని ఉన్నపుడు, సదరు అసలు పయికముమీది వడ్డి అట్లు దానిని ఇయ్యవచ్చిన తేది మొదలుకొని కాని, లేకతనఖావుంచువాడైనను పయినచెప్పబడినట్టి వేఱొక మనుష్యుడయినను, సందర్భప్రకారము, అట్టి మొత్తమును కోర్టులోనుండి తీసికొనుటకుగాను తనఖావుంచువానికి అధికారము కలుగజేయుటకు తాను చేయవలయు దానినంతయు చేసినతోడనేకాని, నిలిచిపోవలయును.

తాకట్టు ధనమును చెల్లించుటకుగాని లేక చెల్లింపవచ్చుటకుగాని పూర్వము సదరు తాకట్టుంచు కొనువాడు క్రమమయిన నోటీసును పొందవలయునను ఒక కరారు జరుగుచున్నపుడు, ఈ సెక్షనులోగాని లేక ౮౩డో సెక్షనులోగాని వుండుదానిని దేనిని, సదరువడ్డిని పొందుటకు అతనికి గల హక్కునకు భంగము కలిగించునట్లు, గ్రహింపగూడదు.

## అవధిక్రయమునకుగాని విక్రయమునకుగాని తాకట్టు విడుదలకుగాని తేబడు వ్యాజ్యములు.

౮౫. సివిల్ ప్రొసీజరు కోడ్డులోని ౪౩౭ డో సెక్షనుయొక్క నిబంధనలకులోనై, తాకట్టులోనున్న సొత్తుపైన బాధ్యతకల అందఱిని, అట్టి తాకట్టును గురించి ఈ అధ్యాయాను సారముగ తెచ్చు ఏవ్యాజ్యమునకైనను కక్షిదార్లుగ చేర్చ వలయును. అయినను అట్టి బాధ్యత కలదని వాదికి నోటీసును యిచ్చి యుండవలయును.

అవధి క్రయమునకును విక్రయ మునకును తాకట్టు విడుదలకును (తేబడు) వ్యాజ్యముల కక్షిదార్లు.

## అవధిక్రయమును విక్రయమును.

అవధిక్రయ వ్యాజ్యములో డిక్రీ.

౮౬. అవధిక్రయమునకుగాను తెచ్చేవ్యాజ్యములో వాదిపక్షముతీర్పు అయిన యెడల కోర్టువారుచేయు డిక్రీలో, ఇందికముందు ప్రస్తావించియున్న తేదికి తాకట్టులో నుండియు అసలుబాబతునువడ్డి బాబతును వాదికిచేరవలయు దానినిగురించియు, వ్యాజ్యములో, అతనికయిన తగులుబడులకుగాను అతని పక్షమున నేదయిన తీర్పు చేయబడియున్న యెడల, అందుకుగాను అతనికి చేరవలయు దానిని గుఱించియు, లెక్క వ్రాయవలయును అని ఉత్తరువు చేయవలయును; లేదా అట్టి డిక్రీ తేదికి ఆలాగు బాకిగానున్న మొత్తమును ప్రకటించి చెప్పవలయును.

మఱియు ఆలాగు బాకిగానున్న మొత్తమును కోర్టులో ప్రకటించి చెప్పిన దినము మొదలుకొని ఆఱు మాసములకులోగా సదరు కోర్టువారు నిర్ణయించుదినమున అట్లు బాకిగానున్న మొత్తమును ప్రతివాది పరముగ గాని కోర్టులోగాని చెల్లించినమీదట, సదరు తాకట్టు ఆస్తికి సంబంధించి తన స్వాధీనమందుగాని లేక అధికారమందుగాని ఉన్న దస్తావేజుల నన్నిటిని వాది ప్రతివాదికిగాని లేక అతడు ఏ మనుష్యుని నియమించునో అట్టివానికిగాని ఒప్పగింత చేయవలయుననియు, వాదివలనగాని లేక అతని తరఫున దావాచేయు ఏ యితరమనుష్యుని వలనగాని లేక ఒకనివద్దనుండి తనకుగలి



గిన హక్కునుబట్టి వాదిదావాచేయు సంగతిలో, ఎవరితరఫున అతడుదావాచేయునో వారివలనగాని కలుగ జేయబడునట్టి ఏ తగాదాలు లేకుండ సదరు ఆస్తిని ప్రతివాదికి పరివర్తన చేయవలయుననియు ఆవశ్యకమయిన యెడల సదరు ఆస్తిని ప్రతివాదికి స్వాధీనము చేయవలయు ననియు ఉత్తరువు చేయవలయును; కాని

కోర్టువారు నిర్ణయించు దినమునగాని అంతకు పూర్వముగాని ఆలాగు పయికమును చెల్లించని యెడల, సదరు ఆస్తిని తాకట్టులోనుండి విడుదల చేయుటకు ప్రతివాదికుండు హక్కు యావత్తును లేకుండ నిరోధింపబడవలయునని వుత్తరువు చేయవలయును.

బాకీమొత్తమును చెల్లించు విషయములోచర్య.

౮౭. ౮౬గో సెక్షనులో ఏవి ఉదాహరింపబడినవో అట్టిమొత్తమును తర్వాతితగులుబడులను చెల్లించియున్న యెడల, (ఆవశ్యకమయిన పక్షమందు) ప్రతి వాదికి తనఖా ఆస్తిని స్వాధీనము చేయవలయును.

అవధి క్రయమునకుగాను పరిష్కారపు ఉత్తరువు.

అట్టి మొత్తమును ఆలాగు చెల్లింపనిచో ప్రతివాదికేమి అతని మూలముగగాని లేక అతని తరఫునగాని దావాచేయువారందఱికేమి, సదరు తనఖా ఆస్తిని విడుదల చేయుటకుగల హక్కు యావత్తును లేకుండ అటంకపఱుప వలయు నను వుత్తరువుకుగాను వాది కోర్టువారికి దరఖాస్తు చేసికొనవచ్చును. అందుమీద కోర్టువారు అట్టి వుత్తరువును ఇయ్యవలసినదే కాక ఆవశ్యకమయిన పక్షమందు సదరు ఆస్తిని వాది స్వాధీనము చేయవచ్చును:

కాలమును ఎక్కువ చేయుట కధికారము.

అయినను కోర్టువారు, సరి అయినకారణమును చెప్పినమీదటను తమకు యుక్తమనితోచిన షరతు లేమయినను౦డిన, ఆ షరతులను బట్టియు, అట్టి మొత్తమును చెల్లించుటకు నియమించిన దినమును అప్పటప్పటికి నిలిపి యుంచవచ్చును.

ఈ సెక్షనుయొక్క రెండవ పేరానుబట్టి వుత్తరువుచేసినమీదట తనఖా ఈడుగలిగిన ఋణమును చెల్లించినట్లే భావింపవలయును.

సివిల్ ప్రొసీజర్ కోడ్ యొక్క ౪ గో (షెడ్యూలు) పట్టీ తాలూకు ౧౯౯ దో నంబరులో "కడపటి డిక్రీ" అనుమాటలకు బదులు "పరిష్కార డిక్రీ" అనుమాటలను వుంచుకొనవలయును.

విక్రయమునకు గాను డిక్రీ.

౮౮. విక్రయమునకయి తేబడు వ్యాజ్యములో వాది పక్షము తీర్పు అయినపక్షమున, ౮౬ రో సెక్షను మొదటి పేరాలోను రెండవ పేరాలోను చెప్పియున్న ప్రకారము కోర్టువారు డిక్రీచేసి వానిలో చెప్పియున్న ప్రకారము పయికమును చెల్లింపక ప్రతి వాది తప్పిపోవు యెడల సదరు తాకట్టు ఆస్తినిగాని లేక చాలినంత అందలి భాగమునుగాని విక్రయింపవలయు ననియు, సదరు విక్రయ ధనమును (అందులో నుండి విక్రయము బాబతు తగులుబడులను తీర్చివేసిన తర్వాత) కోర్టులో చెల్లించి వాదికి బాకీగానున్నట్లు ఏది అగపడునో దానికి చెల్లుగా వుపయోగింపవలయుననియు, బాకి, ఏదయినానున్నయెడల, అది ప్రతివాదికిగాని లేక దానిని తీసికొనుటకు హక్కుగల ఇతరమనుష్యులకుగాని చెల్లింపవలయుననికూడ, వుత్తరువుచేయవలయును.

అవధిక్రయ వ్యాజ్యములో విక్రయమునకై డిక్రీకి అధికారము.

అవధి క్రయమునకుగాను తేబడు వ్యాజ్యములో వాది పక్షము తీర్పు అయి తనఖాషరతుబద్ధమగు విక్రయమును అనుసరించిన తనఖాగానియెడల వాదిగాని లేకతనఖాధనముమీదనయిన తాకట్టువిడిపించుటకుగల హక్కులోనయిన బాధ్యతకల ఎవడైన ఒకడుగాని వేడుకొనిన మీదట కోర్టువారికి యుక్తమనితోచు పక్షమున ఆ విక్రయము బాబతు తగులుబడులను చెల్లించునిమిత్తమున్ను సదరు నిబంధనలను నెఱవేర్చుటకయి జాగ్రతపెట్టుటకున్ను కోర్టువారు నిర్ణయించు క్రమమైన మొత్తమును వారికి యుక్తమని తోచునెడల కోర్టులో చెల్లించుటకు వారికి ఏది యుక్తమని తోచునో ఆ షరతులను అనామతు చేయుటకు తోడుగా జేర్చి (అవధి క్రయమునకుగాను చేసిన డిక్రీకి బదులు) వారు అట్టి డిక్రీని ఇయ్యవచ్చును.



బాకి మొత్తమును ప్రతివాదిచెల్లించునపుడు చర్య.

౮౯. వాదికిగాని లేకకోర్టులోగాని పయిన చెప్పినట్లు నిర్ణయింపబడిన దినమున తనఖామీద బాకీగానున్న మొత్తమును తగులుబడుల చేసినయున అతనికి ఇయ్యవలసినట్లు తీర్పుఅయిన యెడల వానిని, ౯౪ గో సెక్షనులో చెప్పియున్న వేహో అట్టి తర్వాతి తగులుబడులను ౮౮ దో సెక్షనును అనుసరించిన యేసంగతిలోనైన ప్రతివాది చెల్లించునెడల (అవశ్యకమైనచో) తనఖా ఆస్తిని ప్రతివాదికి స్వాధీనము చేయవలయును. కాని ఆలాగు అది చెల్లింపబడని యెడల సందర్భ ప్రకారము వాదిగాని ప్రతివాదిగాని సదరు తనఖా ఆస్తిని విక్రయించు నిమిత్తము పరిష్కారపు ఉత్తరువును ఇచ్చుటకుగాను కోర్టువారికి దరఖాస్తు చేసికొనవచ్చును, అంతుపయిన అట్టి ఆస్తినయినను అందులో చాలినంత భాగమునయినను విక్రయింపవలయుననియు, సదరు విక్రయధనమును ౮౮ దో సెక్షనులో చెప్పిన ప్రకారము వినియోగించవలయు ననియును, అటుతర్వాత కోర్టువారు ఉత్తరువు చేయవలయును. మఱియు అందుపయిన సదరు తాకట్టును విడిపించుటకు ప్రతివాదికిగలహక్కున్ను సదరుతనఖాయున్ను రెంటును అంతము నొందవలయును.

తాకట్టు మీద బాకియున్న మొత్తమును రాబట్టుకొనుట.

౯౦. అట్టి ఏ విక్రయమువల్లనైన వచ్చు నికరపు పయికము తనఖాలో తత్కాలమందు బాకియున్న మొత్తమును చెల్లించుటకు చాలనిదిగా వున్నపుడు, ఆ బాకీ, విక్రయించిన ఆస్తిలోనుండియేకాక మఱియొకరీతిని ప్రతివాదివద్దనుండి న్యాయశాస్త్రసమ్మతముగ

రాబట్టుకొనదగినదయిన పక్షమున, అట్టి మొత్తమునకుగాను కోర్టువారు డిక్రీ చేయవచ్చును.

## తాకట్టు విడుదల.

తాకట్టు విడుదలకు ఎవరు వ్యాజ్యము తేవచ్చునది.

౯౧. తాకట్టుంచువాడే గాక ఈ క్రింద ఉదాహరింప బడిన వారిలో నెవరయినను తాకట్టు సొత్తును విడిపింపవచ్చును, లేదా దానిని విడిపించుకొనుటకు వ్యాజ్యము తేవచ్చును :—

(ఏ) (తాకట్టును విడుదల చేయుటకు హక్కు గల తాకట్టుంచుకొనువాడు గాక) సదరు సొత్తుపయిన ఏ హక్కునయినను పూచీనైనను కలిగియుండు ఏ మనుష్యుడయినను ;

(బి) సదరుసొత్తును విడుదలచేయుటకుగల స్వాతంత్ర్యములో ఏదైన హక్కునుగాని పూచీనిగాని కల ఏ మనుష్యుడైనను ;

(సి) సదరు తాకట్టు ఋణమునుగాని అందలి ఏ భాగమునయినగాని చెల్లించుటకు పుత్తరవాదిగానుండు ఎవడైనను ;

(డి) మైనరుగానుండు తాకట్టుంచువాని తరఫుననుండు సదరుమైనరు యొక్క గార్డియనును ;

(ఇ) పిచ్చివాని తరఫునగాని ఉన్మత్తుని తరఫునగాని సదరు పిచ్చివాడు తాకట్టుంచు వాడైనపుడును లేక ఉన్మత్తుడు తాకట్టుంచు వాడైనపుడును పైవిచారణచేయు సభ (కమ్మిటీ) వారయినను న్యాయశాస్త్ర సమ్మతమయిన యితర అధ్యక్షుడైనను ;

(ఎఫ్) సదరు ఆస్తిమీద తాకట్టుంచు వానికి గల హక్కును జప్తుచేయుటవలన సదరు తాకట్టుంచువాని పయిన తీర్పును పొందిన ఋణదాత సదరు తీర్పునకు పని జరిపించుటకు ఉత్తరువు పొందినపుడు అతడును ;

(జి) తన ఆస్తిని విచారణచేయుటకు తేబడు వ్యాజ్యములో సదరుతనఖా ఆస్తిని విక్రయించుటకుగాను డిక్రీని పొందిన తనఖా వుంచువానికి అప్పు ఇచ్చినవాడును.



తాకట్టువిడుదల వ్యాజ్యములో డిక్రీ.

౯౨. తాకట్టును విడుదల వ్యాజ్యములో వాది పక్షముతీర్పు అయినయెడల కోర్టువారు —

ఇందు క్రింద ప్రస్తాపింపబడిన తేదిని సదరు తనఖా ధనము బాబతును లేక ప్రతివాదికియ్యవలయునట్లు తీర్పు కాబడిన వ్యాజ్యపు ఖర్చుల బాబతును, ఏమయిన ఉన్నయెడల, వానిబాబతును ప్రతివాది కేమి బాకీగానుండునో దానిలెక్కను తీసికొనుటకు ఉత్తరువుచేసి లేక ఆలాగుబాకీగానున్నమొత్తమును అట్టి డిక్రీ తేదిని ప్రకటనచేసి ;

అట్టి బాకిమొత్తమును ప్రతివాదికిగాని కోర్టులోగాని, సదరు బాకిమొత్తమునుకోర్టులో ప్రకటించుదినము మొదలుకొని ఆరుమాసములకులోపుగ సదరహీ కోర్టువారు ఏదినము నిర్ణయింతురో ఆదినమునవాది చెల్లించినమీదట, ప్రతివాది, వాదికైనను లేకఅతడు నియమించువానికైనను తనస్వాధీనమందుగాని అధికారమందుగాని యుండు తాకట్టు ఆస్తిబాబతు దస్తావేజులన్నిటిని ఒప్పగించివేయవలయుననియు, సదరు ఆస్తిని తనఖాలో నుండియు, ప్రతివాదిగాని లేక అతనితరఫున దావాచేయువాడుగాని లేక ఎవనివద్దనుండియైనను తనకువచ్చిన బాధ్యతనుబట్టి ప్రతివాదిదావాచేయు పక్షమున ఎవరి తరఫున అతడు దావాచేయునో వారుకాని కలుగజేసిన తగాదాలలోనుండియు, వదలించి దానిని వాదికి మరల పరివర్తన చేయవలయుననియు, ఆవశ్యకమయిన పక్షమున సదరు తనఖా ఆస్తిని వాదికి స్వాధీనపరుపవలయుననియు ;

కోర్టువారు నిర్ణయించు దినమునగాని లేక అంతకు పూర్వముగాని ఆ ప్రకారము చెల్లించనిచో (సదరు తాకట్టు షరతు తాకట్టుగానైనను భోగ్యపు తాకట్టుగానైనను ఉండిననేతప్ప) సదరు ఆస్తిని విడిపించుకొనుటకు హక్కు బొత్తిగా లేకుండ వాదిని నిరోధింపవలయుననియును లేక (సదరు తనఖా షరతు బద్ధమగు విక్రయము ననుసరించిననే తప్ప) సదరు ఆస్తిని అమ్మవలయుననియును ;

ఉత్తరువుచేయుచు ఒక డిక్రీని చేయవలయును.

తాకట్టు విడుదలవిషయములో స్వాధీనము.

౯౩. ౯౨ గో సెక్షనులో ఏవి చెప్పబడినవో అట్టి మొత్తమును అట్టి తర్వాతి తగులుబడులను చెల్లించిన పక్షమందు, ఆవశ్యకమయినచో, వాదిసదరు తాకట్టు ఆస్తియొక్క స్వాధీనమును పొందవలయును.

తప్పిపోవునెడల అవధిక్రయములేక విక్రయము.

ఆప్రకారము వానినట్లు చెల్లింపనిపక్షమందు (సదరు తనఖా వట్టితనఖాగాగాని భోగ్యపు తనఖాగాగాని ఉండిననే తప్ప) వాదిగాని లేక అతనిగుండ అయినను అతని తరఫుననయినను దావాచేయు వారందఱుగాని ఆతనఖాను విడిపించుటకు గల హక్కు ఎంతమాత్రము లేకుండ బొత్తిగ నిరోధింపబడవలయునను ఉత్తరువుకొఱకుగాని లేక (ఆతనఖా షరతుబద్ధమగు విక్రయమూలకమయినదైనతప్ప) తనఖా ఆస్తినివిక్రయింపవలయునను ఉత్తరువుకొఱకుగాని ప్రతివాది కోర్టువారికి వ్రాసికొనవచ్చును.

మొదటి ఉత్తరువుకొఱకు అతడు వ్రాసికొనినపక్షమందు వాదికిని అతనిని బట్టికాని అతని తరఫునగాని దావాచేయు వారికందఱకును ఆ తనఖా ఆస్తిని విడిపించుకొనుటకుగల తమహక్కు ఏమాత్రములేకుండ నిరోధింపవలయునని కోర్టువారు ఉత్తరువుచేయుటయేకాక ఆవశ్యకమయినచో, సదరు ఆస్తిని ప్రతివాదికి స్వాధీనముచేసి ఒప్పగించవచ్చును.

రెండవ ఉత్తరువుకొఱకు అతడు వ్రాసికొనిన పక్షమున అట్టి ఆస్తినిగాని అందుజాలినంత భాగమునుగాని అమ్మివేసి సదరు విక్రయమువలన వచ్చుపయికమును (విక్రయముకు అగు తగులుబడులను దానిమూలముగా తీర్చివేసినతర్వాత) కోర్టులో చెల్లించి ఇంకను ప్రతివాదికి ఏమిబాకీగానుండునట్లు అగపడునో ఆబాకీని చెల్లించుటకు దానిని ఉపయోగించుమనియు, మిగత వాదికిగాని దానిని పొందుటకు హక్కుగల యితరులకుగాని చెల్లించుమనియు కోర్టువారు ఉత్తరువు జారీచేయవలయును.



ఈ సెక్షనును అనుసరించి ఏయుత్తరువునైన జారీచేసిన మీదట తాకట్టును వదలించుకొనుటకు వాదికిగల హక్కును తాకట్టును రెండును సదరు వుత్తరువువలన బాధింపబడు ఆస్తికి సంబంధించి నశించిపోవలయును.

కాలమును ఎక్కువ చేయుట కధికారము.

అయినను మంచికారణమును జూపినమీదటను కోర్టువారికి యుక్తమని తోచునట్టి ఒడంబడికలేవయినవున్న యెడలవానిని బట్టియు, అప్పుడప్పుడు ప్రతి వాదికి చెల్లింపవలయు దానికయి ౯౨ డో సెక్షనును బట్టి నిర్ణయింపవలయు దినమును అప్పటప్పటికి ఆపవచ్చును.

డిక్రీకి తర్వాత తాకట్టుంచుకొన్నవానికి తగులుఖర్చులు.

౯౪. తనఖా విడిపించునట్టిగాని లేక ఈయధ్యాయమును బట్టి కోర్టువారు విక్రయమునుజరిపించునట్టిగాని సంగతిలో తాకట్టుంచుకొనువానికి చెల్లింపవలయు మొత్తమును ఆఖరుగా క్రమపఱిచి యేర్పాటుచేయునపుడు, తగులుబడులకుగాను తాకట్టుంచుకొనువాని నడత అతనికి హక్కు లేనివానినిగా జేయునట్టిదయి వుండిననే తప్ప, కోర్టువారు ఆతనఖాధనముతోగూడ అవధిక్రయమునకుగాని తనఖా విడుదలకుగాని విక్రయమునకుగాని డిక్రీచేసినది మొదలు దానిని వాస్తవముగ చెల్లించు వరకు అతనికి తగిలిన వ్యాజ్యపు తగులుబడులను గూడ జేర్పవలయును.

తోడి తాకట్టు ఉంచిన వారు పలువురిలో విడుదల చేయునట్టివానికిగల హక్కు.

౯౫. వెవ్వేఱు తనఖావుంచువారిలో ఒకడు ఆ తాకట్టు ఆస్తిని విడిపించుకొని దాని స్వాధీనము పొంది యున్నపుడు, ఆప్రకారము దానిని విడిపించుకొనుటకును స్వాధీనము చేసికొనుటకును అతనికి న్యాయముగ తగిలిన తగులుబడులలో ఆ ఆస్తిపైన హక్కుగల తనతోడి ప్రతి తనఖావుంచువారల భాగములోను తన భాగప్రమాణమును పొందుటకు హక్కుకలిగియుండును.

ముందటి తాకట్టుకు లోబడి ఆస్తిని విక్రయించుట.

ముందటి తాకట్టునకులోబడిఆస్తినివిక్రయించుట.

౯౬. ఈయధ్యాయమును అనుసరించి విక్రయమునకు ఉత్తరువుకాబడిన ఆస్తిముందటి తాకట్టులో నున్న పక్షమున, ముందటి తాకట్టుంచుకొను వాని సమ్మతిని తీసికొని అట్లుఅమ్మబడిన ఆస్తిమీద మొదటితనఖా వుంచుకొనువానికే బాధ్యతయుండునో సదరు విక్రయధనముమీదను ఆబాధ్యతనే యిచ్చుచు కోర్టువారు సదరు మొదటి తనఖానుండి వదలించి సదరు ఆస్తి అమ్మబడునట్లు వుత్తరువు చేయవచ్చును.

విక్రయ ధనమును వినియోగించుట.

౯౭. అట్టివిక్రయధనమును కోర్టులోకితీసుకొనివచ్చి ఈక్రింద చెప్పినట్లు వినియోగింపవలయును:—

మొదట, విక్రయమువలన సంభవించినట్టిగాని లేక యత్నించిన ఏవిక్రయములోనయిన క్రమముగా తగులుబడి అయినట్టిగాని ఖర్చులనన్నిటిని చెల్లించుటకును;

రెండు, సదరుఆస్తిని ముందటి తాకట్టునుండి చేనినుండిఅయిన తప్పించి అమ్మిన పక్షమున, అట్టి తాకట్టు విషయములో ఎంత బాకిగా నుండునో దానిని చెల్లించుటకును;

మూడు, దేనికిగాను విక్రయము చేయుటకు ఉత్తరువుచు ఇచ్చినారో ఆతాకట్టునుబట్టి బాకిఅయిన వడ్డినంతయును, విక్రయమునకు ఉత్తరువును ఇచ్చిన డిక్రీ దేనిలో ఇయ్యబడినదో ఆవ్యాజ్యములో అయిన తగులు బడులను చెల్లించుటకును;

నాలుగు, సదరు తాట్టును బట్టి బాకిపడు అసలు పయికమును చెల్లించుటకును;

కడపట, మిగతను (ఏమయిననుండిన) విక్రయమయిన ఆస్తిలోతనకు బాధ్యత వున్నట్లు రుజువుపఱుచు సఘరుకు చెల్లింపవలయును; లేక అట్టి మనుష్యులు ఒకనికంటె అధికమయి యున్న పక్షమున, అప్పుడు అందులో



వారికిగల ఆయాహక్కులను బట్టిగాని లేకవారుఉన్నడి రసీదులుయిచ్చిన మీదటగాని అట్టివారికి చెల్లింపవలయును.

ఈ సెక్షనులోగాని ౯౭గో సెక్షనులోగాని ఉండు దేనిని ౫౭డో సెక్షనుకలుగజేసిన అధికారములకు బాధకముకలిగించునట్లు తలంపగూడదు.

విపరీతపు తాకట్లు.

౫౮ దో సెక్షను (బి), (సి), (డి), (ఇ) క్లాజులలో వివరింపని తాకట్టు.

౯౮. వట్టి తాకట్టుగాగాని, షరతు బద్ధమగు విక్రయ మూలకమయిన తాకట్టుగాగాని, భోగ్యపు తాకట్టుగా గాని, ఇంగిలీషు తాకట్టుగాగాని లేక అట్టి తాకట్లలో మొదటిది, మూడవదియు, లేక రెండవది మూడవదియు, చేరియుండు తాకట్టుగాగాని, ఉండని ఒక తాకట్టు విషయములో కక్షిదారుల హక్కులను జవాబు దారీలను తాకట్టు పత్రములో నిర్దేశించిన ప్రకారమును వారి కరారును బట్టియు, అట్టివారి కరారు వర్తింప నంతవరకు, ప్రదేశాచారమునుబట్టియు, నిర్ణయింపవలయును.

తాకట్టు ఆస్తి జప్తి.

౯౯. తాకట్టునుబట్టి కలిగినదైనను కాసిదయినను ఏదయిన దావాను సమర్థించుట కొఱకు ఇచ్చిన డిక్రీని పని జరిగించు తాకట్టుంచుకొనువాడు సదరు తాకట్టు ఆస్తిని జప్తిచేయు నెడల, ౬౭డో సెక్షనును బట్టి వ్యాజ్యము తెచ్చుట మూలముగ గాకుండ మఱియొక విధముగ అట్టి ఆస్తిని విక్రయమునకు తెచ్చుటకు అతనికిహక్కును కలుగజేయగూడదు. మఱియు సివిల్ ప్రొసీజరు కోడ్డు ౮౬డో సెక్షనులో ఏమిచెప్పియున్నను నిమిత్తములేకుండ అతడు అట్టి వ్యాజ్యమును తేవచ్చును.

పూచీలు (చార్జీలు).

పూచీలు(చార్జీలు).

౧౦౦. కక్షిదారుల వ్యవహారము వల్లగాని లేక చట్టము అమలువల్లగాని ఒకనియొక్క స్థిరాస్తి మఱియొకనికి పయిక

మును చెల్లించుటకొఱకు యీడుగావుంచబడి, సదరు వ్యవహారము తాకట్టుకానట్టి విషయములో అట్టి యీడును పెట్టుకొను రెండవవానికి సదరు ఆస్తిపయిన పూచీ కలదని చెప్పబడును; మఱియు తనఖావుంచువాని విషయములో ఇంతకుముందిందు చెప్పిన నిబంధనలన్నియు సాధ్యమయినంతవఱకు అట్టి సొత్తుయొక్క యజమానునికి చెందవలయును; ౮౮, ౮౭ డో సెక్షనులలోని నిబంధనలును సదరుతాకట్టు ఆస్తి విక్రయమునకుగాను వ్యాజ్యమును తెచ్చునట్టి తనఖా వుంచుకొను వాని విషయములో నని ఇంతకు ముందిందు చెప్పిన నిబంధనలన్నియు సాధ్యమయి నంతవఱకు అట్టి పూచీగల మనుష్యునకు చెందవలయును.

ట్రస్టీయొక్క ట్రస్టును నెఱవేర్చుటలో న్యాయముగ తగిలిన తగులుబడులకుగాను ట్రస్టు ఆస్తిమీదనుండు అతని పూచీకి ఈ సెక్షనులోనుండునది ఏదియు ప్రయోగపడదు.

పూచీలు నశించుట.

౧౦౧. స్థిరాస్తిపైని పూచీయొక్కగాని లేక ఇతర అప్పుచిక్కు సంబంధించినట్టిగాని యజమానికి సదరు ఆస్తి విషయములో పూర్ణహక్కు కలిగియుండిగాని లేక సంభవించిగాని వున్నపుడు, సదరు పూచీగాని అప్పుచిక్కుగాని జరుగుచుండవలయుననియు లేక అట్లు జరుగుదలలో నుండుట తనకు లాభకరమనియు స్పష్టమైన మాటల మూలముగాగాని, లేక ఆవశ్యక సూచనమూలముగగాని, రూఢిగ చెప్పియుండిననే తప్ప సదరు పూచీయు అప్పుచిక్కును నశించిపోవలయును.

నోటీసును (పయికమును) చెల్లింపవచ్చుటయు.

ఏజెంటుకు నోటీసుజారి చేయుట లేక పకయికము చెల్లింపవచ్చుట.

౧౦౨. ఈ యధ్యాయమును అనుసరించి ఎవనికి నోటీసును చేనినైన ఇత్తురో లేక ఎవనికి పైకమును చెల్లింపవత్తురో ఆమనుష్యుడు సదరు తనఖా ఆస్తిగాని అందలి కొంతభాగముగాని ఉండియుండు డిస్ట్రిక్టులో వాసముచేయని పక్షమున, ఆ మనుష్యుని వద్ద



నుండి ఒక సామాన్యవకాలతునామా పుచ్చుకొనియున్నట్టిగాని, లేక ఆప్రకారము ఇయ్యబడు నోటీసునైనను చెల్లింపరాబడు పైకమునైనను అంగీకరించుటకు మఱియొకరీతినిక్రమముగా అధికారము పొందియున్నట్టిగాని, ఏజెంటుకు నోటీసును ఇచ్చుటయైనను పైకమును చెల్లింపబోవుటయైనను చాలినదిగా ఎంచబడవలయును.

అట్టినోటీసు ఎవరికియ్యవలయునో అట్టి మనుష్యుడుగాని ఏజెంటుగాని సదరు డిస్ట్రిక్టుకు లోపుగాకనపడని పక్షమందుగాని లేక తాకట్టు ఆస్తిని విడిపించుటకు నోటీసును ఏమనుష్యుడు జారీచేయవలయునో వాడు వానిని ఎఱుగని పక్షమందుగాని వ్యాజ్యము ఏకోర్టులో తేబడినదో ఆ కోర్టునుకడపట ప్రస్తాపింపబడినవాడు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. ఏవిధముగ అట్టి నోటీసును జారీచేయవలయునో ఆ సంగతినిగుఱించి అట్టి కోర్టువారు వుత్తరవుచేయవలయును. మఱియు అట్టి వుత్తరువునుబట్టి జారీచేయబడు నోటీసును చేనినయిన చాలియుండుదానినిగ భావింపవలయును.

ఎవరికి పైకమును చెల్లింపవలయునో అట్టిమనుష్యుడుగాని వాని ఏజెంటుగాని సదరుడిస్ట్రిక్టులో కనబడనిపక్షమందు, లేక ఎవడు పయికమును చెల్లింపరాగోరునో ఆ మనుష్యుడు వానిని ఎఱుగనిపక్షమందును, చెల్లింపరావలయునని ప్రయత్నించిన మొత్తమును ఇంతకుముందె పయిన చెప్పబడినకోర్టులో, రెండవసారి ప్రస్తాపింపబడినవాడు అనామతు ఉంచవచ్చును. అట్టి అనామతుకు అట్టిమొత్తమును చెల్లింపవచ్చిన నెల్లో అక్లే అమలువుండవలయును.

కగారుచేయుట కనర్హుడయినవానికిగాని అట్టివానివల్లగాని నోటీసుమొదలయినవి.

౧౦౩. ఈయధ్యాయములోని నిబంధనలనుబట్టికరారుచేసికొనుయోగ్యతలేని ఏ మనుష్యునకయినను, లేక ఏ మనుష్యునివల్లనయినను, నోటీసు అందచేయబడి పైకము చెల్లింపబడి, లేక అనామతుచేయబడి లేక కోర్టులోనుండి అంగీకరింపబడి లేక పుచ్చుకోబడవలసియున్న సంగతిలో, అట్టి నోటి

సు అట్టివాని ఆస్తికి న్యాయశాస్త్రతః సంరక్షకుడయిన వాని చే అట్టినోటీసు జారీచేయబడి, సదరు పయికము చెల్లింపబోబడి, సదరు ప్రకారము అనామతు చేయబడి, అంగీకరింపబడి లేక పుచ్చుకోబడి, యుండవచ్చును. కాని అట్టిసంరక్షకుడు, ఎవడు లేకుండియున్నను లేక వానిలాభముకొఱకు ఈ అధ్యాయములోని నిబంధనలననుసరించి సదరు నోటీసును అంపజేయుటగాని, సదరు పయికము చెల్లింపబోబడుటగాని, లేక అనామతుచేయుటగాని ఆవశ్యకమయినదిగానయినను అపేక్షణీయ మయినదిగానయినను ఉన్నపక్షమందు, అట్టినోటీసును జారీచేయుటకుగాని లేదా జారీచేసిన దానిని పుచ్చుకొనుటకుగాని ఆపయికమును చెల్లింపవచ్చుటకుగాని దానిని అంగీకరించుటకుగాని, లేక అనామతుచేయుటకుగాని లేదా కోర్టులోనుండి దానినిపుచ్చుకొనుటకు వ్యాజ్యెపునిమిత్తముగు (గార్డియనును) సంరక్షణకర్తను నియమించుటకయి అట్టివాడు కరారుచేయుట కర్హుడయియున్నపక్షమున అతనివల్ల జరిగింపబడగూడినట్టిగాని లేక అతడు జరిగింపవలసినట్టిగాని సంబంధముగల వ్యవహారముల నన్నిటిని నెఱవేర్చుటకొఱకును తనఖాను విడిపించుటకు ఏ కోర్టులో వ్యాజ్యము తేబడియున్నదో ఆయాకోర్టువారికయినను దరఖాస్తు చేసుకొనవచ్చును. సివిల్ ప్రొసీజరు కోడ్డుయొక్క ౩౧ వ అధ్యాయములోని నిబంధనలు సాధ్యమైనంతవఱకు అట్టిదరఖాస్తునకును దానియిలాకా కక్షిదార్లకును దానినిబట్టి నియోగింపబడ్డ సంరక్షణ కర్తకును ప్రయోగపడవలయును.

౧౦౪. ఈ యధ్యాయములోని నిబంధనలను తమకోర్టులోను తమకులోబడియున్న సివిల్ విచారణ అధికారముకల కోర్టులలోను కొనసాగింపగలందులకు హైకోర్టువారు ఈ యాక్టుకు అనుగుణ్యముగ, అప్పుడప్పుడు, విధులను చేయవచ్చును.

విధులను జేయుట కధికారము.

---



## ౫ వ అధ్యాయము.

### స్థిరాస్తి గుత్తలను గుఱించి.

౧౦౫. స్థిరాస్తి గుత్త అనగ, చెల్లించినట్టిగాని లేక వాగ్దానముచేసినట్టిగాని ఖరీదుకయినను లేక ఆయాకాలముల యందుగాని నిర్దిష్ట కాలములయందుగాని ఆవర్తులమీద పరివర్తన నంగీకరించునట్టి తాకట్టుంచుకొనువాడు తాకట్టుంచువానికిచ్చు పయికమునకో, పంటలలోని పాలునకో, నవుకరీకో, లేకకిమ్మతుకల ఇతరవస్తువు దేనికయిననో బదులుగ, స్పష్టపఱిచినట్టిగాని స్ఫురింపజేసినట్టిగాని ఒకానొక కాలము వఱకయినను లేక శాశ్వతముగ నయినను, అట్టి ఆస్తిని అనుభవించుటకుగాను దానిపయిని హక్కును పరివర్తనచేయుట.

"గుత్త" నిర్వచనము.

ఆ పరివర్తనచేయువాడు గుత్తకిచ్చువాడనియు, ఆ పరివర్తన కయికొనువాడు గుత్త కాడనియు చెప్పబడుదురు. దానికయి ఇయ్యబడుకిమ్మతు గుత్తధనమనియు ద్రవ్యమూలముగనో పాలును బట్టియో నవుకరినిబట్టియో లేక అట్లు ఇయ్యవలయు ఇతరవస్తువునుబట్టియో ఉండునది బాడుగ యనియు చెప్పబడును.

"గుత్త కిచ్చువాడు", "గుత్త కాడు", "గుత్త ధనము", "బాడుగ" నిర్వచనములు.

౧౦౬. దానికన్యథా కరారు గాని ప్రదేశాచారము గాని లేనిచో, వ్యవసాయమును లేక వస్తునిర్మాణమును చేయు కార్యములకుగాను స్థిరాస్తిని గుత్తకిచ్చుట అనునది సంవత్సరవారి గుత్తగానున్నట్టు గ్రహింపవలయును, దానిని గుత్తకిచ్చువానికి లేక గుత్తగానికి సదరు అనుభవము ఏ సంవత్సరాంతముతో కడముట్టునో ఆగడువుకు ఆఱుమాసములుముందుగా నోటీసును ఇచ్చినచో ఆగడువు అంతము చందగి యుండును. ఏ యితర కార్యమునకయిన

లిఖిత రూపమగు కరారుగాని ప్రదేశాచారము గాని లేనిచో కొన్ని గుత్తల (అమలు) కాలము.

నీబడు స్థిరాస్తి గుత్త గుత్తకిచ్చువానికిగాని గుత్తగానికిగాని ఏనెలతో అంతమొందునో ఆమాసాంతరము మొదలు అప్పటికి పదునేనుదినములుముందుగ నోటీసు యియ్యబడినయెడల సదరు దాని అనుభవము అంతమొందదగియుండు నెలసరి గుత్తగా గ్రహింపవలయును.

ఈ సెక్షనునుబట్టి ఇయ్యబడు లిఖితరూపకమగు ప్రతి నోటీసులోను దానినిచ్చు కక్షిదారునివల్ల గాని అతని తరఫునగాని చేవ్రాలు చేయబడి, దానిప్రకారము బద్ధుడైనడచుకొనునట్లు అందునుద్దేశింపబడ్డ ఆసామికి ప్రత్యక్షముగానయినను అతని నివాస స్థలమందుండు అతని కుటుంబస్థులలో గానినవుకర్లలోగాని ఒకనిపరముగానయినను ఇచ్చి లేక అప్పగించి, (అట్లు ఇచ్చుటయయిన ఒప్పగించుటమైన సాధ్యము కానియెడల) సదరు ఆస్తిలో ప్రాముఖ్యమయిన భాగమునకు అంటించి, యుంచవలయును.

గుత్త లెట్లు చేయబడునది.

౧౦౭. ఏయేటికిగాని ఒక యేటికి మించినకాలమునకు దేనికయినగాని ఏటి బాడుగ వేలుగ నుంచియయిన చేసికొను స్థిరాస్తి గుత్త, రిజిస్టరు పత్రము మూలమున మాత్రమె చేసికొనబడగలదు.

ఇతర స్థిరాస్తి గుత్తలన్నియుదస్తావేజు మూలముగ నయినను మౌజువాని ఒడంబడిక మూలముగనయినను చేసికొనవచ్చును.

గుత్తకిచ్చువానియొక్కయు గుత్తగానియొక్కయు హక్కులును జవాబు దారీలును.

౧౦౮. అన్యథా కరారుగాని ప్రదేశాచారముగాని లేనిచో, స్థిరాస్తి గుత్తకిచ్చువాడును గుత్తకాడును ఒకని మీదనొకడు వరుసగ ఈక్రిందనె ఉండువిధులలోను లేక గుత్త ఆస్తికి సంబంధించిన విధులేవో వానిలో నుచెప్పబడిన జవాబుదారీలకు లోబడి హక్కులనుకలిగియుందురు :—

ఏ.— గుత్తకిచ్చువాని హక్కులును జవాబుదారీలును.

(ఏ) గుత్తకిచ్చువాడు ఎఱిగియుండి గుత్తకాడు ఎఱుగనట్టియు గుత్తకాడు (తన) సాధారణజాగ్రతవలన గనుగొనజాలనట్టియు ఆస్తిని ఉద్దిష్ట



ప్రయోగము చేసికొనుటకుగాను ఆయాస్తియందుండు ముఖ్యమయిన యే లోపమునయినను గుత్తకిచ్చువాడు గుత్తగానికి తెలియపఱుచుటకు బద్ధుడైయుండును.

(బి) గుత్తకాడు కోరినమీదట సదరు ఆస్తి వాని స్వాధీనములోనుంచుటకు గుత్తకిచ్చువాడు బద్ధుడైయుండును :

(సి) సదరుగుత్తవలన నిలుపుకొనబడిన బాడుగను గుత్తకాడు చెల్లించి తనకు విధిమైయున్న కరార్లను నెఱవేర్చుపక్షమున సదరు గుత్తలో మితియేర్పఱుపబడియుండు కాలములో నిరాటంకముగ తానా యాస్తిని అనుభవములో నుంచుకొనవచ్చునని గుత్తగానితో గుత్తకిచ్చువాడు కరారుచేయునట్లు తలంపవలయును.

అట్టి కరారువలని లాభము అట్టి గుత్తగాని హక్కుతో అట్లేచేరి దానిననుసరింపవలయుచు, మఱియు అప్పుడప్పుడు దాని యావత్తు మీదగాని అందలిభాగము దేనిమీదగాని ఉండుహక్కు ఎవనికి గలుగజేయబడుచున్నదో అట్టి ప్రతివానివలనను అది అములు చలాయింపబడవలయును.

బి.— గుత్తగాని హక్కులును జవాబుదారీలును.

(డి) సదరు గుత్త జరుగుచుండగ సదరు ఆస్తికేదైన అభివృద్ధి చేయబడిన పక్షమున (తత్కాలమందు అమలులోనున్న బందు బెట్టుటకు సంబంధించిన చట్టమునకులోనయి) అట్టి అభివృద్ధి విషయము గుత్తకాగితములో నున్నట్టుగ గ్రహింపవలయును :

(ఇ) అగ్నివలనగాని తుపానువలనగాని లేక వరదవలనగాని లేదా సైన్యముయొక్క చెడుమూకయొక్క లేక అనతిక్రమణీయమగు ఇతర బలగముయొక్క దౌర్జన్యమువలనగాని సదరు ఆస్తిలోని ముఖ్యభాగము ఏది అయిన యావత్తును చెఱుపబడిగాని లేక అది ఏకార్యమునకై బాడుగకిబడినదో ఆకార్యమునకు దానిని సేనానుట్టుకు స్థిరముగా అనర్హమయినదిగ

చేయబడిగాని యుండు నెడల, సదరుగుత్త గుత్తగాని యిష్టమునుబట్టి చెల్లదగనిదిగా నుండవలయును:

అయినను, సదరు అపాయము గుత్తగాని అక్రమ కార్యమువలనగాని లోపమువలనగాని సంభవించినయెడల అతడు ఈ నిబంధనలోని లాభము నుపయోగపఱుచుకొనుటకు హక్కుకలిగియుండగూడదు:

(ఎఫ్) గుత్తకిచ్చువాడు నోటీసును పొందిన తర్వాత న్యాయమయిన కాలములోగ తాను సదరు ఆస్తికిచేయుటకు బద్ధుడైయుండు మరమ్మతులనుచేయక అలక్ష్యముచేయునెడల, గుత్తగాడు వానిని తానేచేసి సదరు మరమ్మతులకుగాను అగు ఖర్చులను వడ్డితోగూడ సదరు బాడుగలోనుండి దీసివేసియైనను లేక ఇంకేవిధముగనైనను గుత్తకిచ్చువాని వద్దనుండి రాబట్టుకొనవచ్చును:

(జి) గుత్తకిచ్చువాడు తానుచెల్లింపవలయుపైకమును చెల్లింపక అలక్ష్యముచేసి దానిని వాడు చెల్లింపకున్నను గుత్తగానివలనగాని సదరు ఆస్తి మీదగాని రాబట్టుకొనదగియుండిన యెడల, గుత్తగాడు సదరు పైకమును తానేచెల్లించి దానిని వడ్డితోగూడ దాని బాడుగలో నుండి తీసివేసియైనను మఱి యింకే విధముగనయినను గుత్తకిచ్చువాని యొద్దనుండి రాబట్టుకొనవచ్చును:

(ఎచ్) సదరుగుత్త జరుగుచున్నపుడెప్పుడైనను తానుభూమితోచేర్చిన వాని నన్నిటిని గుత్తగాడు తీసికొనిపోవచ్చును: అయినను, అతనికి అందజేసినపుడు సదరు ఆస్తి ఏస్థితియందు ఉండెనో ఆస్థితియందేదానిని ఉంచవలయును:

(ఐ) సందిగ్ధకాలముదాక నిలబడినగుత్త గుత్తగాని తప్పిదమువలనగాక ఇంకేవిధమునయిన కడతేఱునపుడు గుత్తగాడుపయిర్లను అందులో మొలవేసికాని విత్తిగానియుండి అవి సదరు ఆస్తిలో సదరు గుత్త కడతేఱునప్పటికి పెఱుగుచున్నపుడు గుత్తగాడుగాని న్యాయమగు అతని ప్రతినిధిగాని



సదరుపైర్ల అన్నిటిపైనను హక్కుగలిగి వానిని పోగుచేసి తీసికొనిపోవుటకు నిరాటంకముగ రాకపోకలు జరుపుకొన గలిగియుండును:

(జె) గుత్తగాడు సదరు ఆస్తి పయిన తనకుగల బాధ్యతను యావత్తుగాని దానిలోని ఏ మాత్రమునయినగాని పూర్ణముగా నయినను తనఖా మూలముగానయినను లోపాయకారి గుత్త మూలముగానయినను పరివర్తనచేయవచ్చును; అట్టిబాధ్యతనుగాని దానిలో ఏమాత్రమునయినగాని పరివర్తనకు చేకొనువాడు ఎవడైనదానిని తిరిగి పరివర్తనచేయవచ్చును. అట్టిపరివర్తన హేతువున బట్టిగుత్తకుసంబంధించియున్న జవాబుదారీలకు వేనికైనను గుత్తగాడు లోనై యుండక వదలుకొనగూడదు:

ఈక్లాజులోనుండు దానిని దేనిని పరివర్తనాధికారము లేక ఆక్రమణ చేసికొనుటకుహక్కుగల బాడుగనిచ్చి అనుభవించువానికిని రివిన్యూ చెల్లింపక లోపమును జరిగించిన ఎస్టేటుకాపునకుగాని లేకకోర్టాఫ్ వార్డ్సువారి నిర్వాహకము క్రింద నున్నట్టి ఎస్టేటు గుత్తగానికిగాని అట్టి బాడుగనిచ్చి అనుభవించువాడుగగాని కాపుగగాని గుత్తగాడుగగాని ఉండి తనబాధ్యత స్థాపించుకొనుటకు అధికారమిచ్చునట్లు గ్రహింపగూడదు:

(కె) గుత్తగాడు ఎఱిగియుండి గుత్తకిచ్చువాడు ఎఱుగనట్టియు బాధ్యతయొక్క విలువను ముఖ్యముగ వృద్ధిపఱుచునట్టియు సదరు గుత్తగాడు పొందబోవు అట్టి బాధ్యతయొక్క స్వభావము లేక (స్థల) వ్యాప్తివిషయమయిన సంగతిని దేనినయిన గుత్తగాడు గుత్తకిచ్చువానికి వెల్లడి చేయవలయును:

(యల్) గుత్తగాడు సదరుగుత్తధనమునుగాని బాడుగనుగాని తగినకాలమందును స్థలమందును గుత్తకిచ్చువానికిగాని అతనితరఫు ఏజెంటునకుగాని చెల్లించుటకైనను చెల్లింపవచ్చుటకైనను బద్ధుడైయుండును:

(యమ్) క్రమమైన భేదక్షయమువలనగాని అనతిక్రమణీయమగు బలవేగమువలనగాని కలుగుమార్పులుగాక, గుత్తగాడు ఆయాస్తిని తనస్వాధీన

ములోనికి వచ్చినపుడే స్థితియందున్నదో దానిని ఆ స్థితియందుంచుటకును, సదరు గుత్తగడువు తీఱినమీదట దాని నాస్థితియందు ఉంచియే అప్పగింత చేయుటకును, సదరు గడువు కాలములో క్రమమయిన వేళల యందెల్లపుడును గుత్తకిచ్చువానిని లేకవాని ఏజెంట్లను సదరు ఆస్తిలోనికి రానిచ్చి దాని స్థితిని తనఖీచేయుటకును సదరుస్థితియందలి లోపమునుగుఱించి నోటీసును ఇచ్చుటకును, బద్ధుడైయుండును. అట్టిలోపము గుత్తగానివలనగాని వాని నవుకర్లవలనగాని ఏజెంట్లవలనగాని జరిగింపబడిన కార్యము చేతనైనను లేక వారు చేయవలయు దానిని చేయకుండుట చేతనయినను కలిగినప్పుడు అట్టి నోటీసును ఇచ్చుటకుగాని లేక ఇయ్యజేయునట్టిగాని మూడు నెలలలోగ దానిని పూర్తిపఱుచుటకు బద్ధుడైయుండును:

(యన్) సదరు ఆస్తినిగాని అందులభాగమునుదేనినైనగాని రాబట్టుకొనుటకు జేయునట్టి ఏ చర్యవిషయమయినను, లేక అట్టి ఆస్తిమీద గుత్తకిచ్చువాని హక్కులను అతిక్రమించుట విషయమయినను లేక వానిని బాధించుట విషయమయినను గుత్తగానికి తెలియవచ్చిన పక్షమందు వాడు దానిని గుఱించి తగిన శ్రద్ధతో నోటీసును గుత్తకిచ్చు వానికిచ్చుటకు బద్ధుడయియుండును:

(ఓ) సదరుగుత్తకాడు ఆయాస్తి అందలి (ఏదయిన) ఫలములును తన విధైనయెడల సాధారణ జ్ఞానము నుకలవాడు వానినెట్లు ఉపయోగించుకొనునో అట్లే వానిని ఉపయోగపఱుచుకొన వచ్చును; కాని అది గుత్తకీబడినట్టిపనికంటె అన్యమయిన దానికి దేనికిని, అందలి కలపచెట్లను కొట్టుటకును, అందలి యిండ్లను పడగొట్టుటకును లేక వానికి అపాయము కలుగ చేయుటకును ఆగుత్తను గ్రాంటుచేసినపుడు పనిలోవుండని గనులలో లేక నల్ల ఱాతిదిబ్బలలో పనిచేయుటకును, లేక సదరు ఆస్తికి నాశకరమయినట్టియు స్థిరాపాయకరమయినట్టియు ఏ యితర కార్యమును జరుపుటకును సదరు ఆస్తి ఉపయోగపఱుచుకొనగూడదు, మఱి అన్యుని ఉపయోగించుకొననియ్యగూడదు:

(పి) గుత్తకిచ్చువాని సమ్మతి లేకుండ సదరు ఆస్తియయిన కృషి కార్యములకుతప్ప వాడు ఏశాశ్వతమైన కట్టడమును కట్టగూడదు:

(క్యు) సదరుగుత్తగడువుతీఱిపోయినమీదట గుత్తగాడు సదరు ఆస్తిని గుత్తకిచ్చువాని స్వాధీనమందుంచుటకు బద్ధుడైయుండును.



గుత్తకిచ్చువానివద్ద పరివర్తనచేకొనువానిహక్కులు.

౧౦౯. గుత్తకీబడిన ఆస్తినిగాని అందలిభాగమును దేనినయినగాని లేక తనకుగల అందుల హక్కులోని భాగమునుదేనినయినగాని గుత్తకిచ్చువాడు పరివర్తనచేయు పక్షమందు సదరు పరివర్తనను చేయుకొనువాడు, అన్యథాకరారు లేనిచో సదరు గుత్తకిచ్చువానికి ఆయాస్తి మీదగాని అందలిభాగముమీదగాని తాను యజమానుడై యుండునంతదాక ఉండు హక్కులను అన్నిటికి గలిగి గుత్తగాడు అప్రకారము కోరినయెడల గుత్తకిచ్చువానికిగల జవాబుదారీలకన్నింటికి లోనయియుండునుగాని అట్టి పరివర్తన మాత్రకారణముననే సదరు గుత్తగాడు ఆ పరివర్తనచేయుకొనువానిని జవాబుదారిగలవానినిగ పరిగణింపుటకు ఏర్పఱుచుకొనిననేతప్ప సదరు గుత్తకిచ్చువాడు సదరుగుత్త అతనిపయిన మొపు జవాబుదారీలకు దేనికిబద్ధుడుగాక విడవగూడదు:

అయినను, ఆపరివర్తన చేయుకొనువాడు సదరు పరివర్తనకు పూర్వము బాకీగానుండు బాడుగ బాకీలకు బాధ్యత కలిగియుండడు, మఱియు అట్టిపరివర్తన జరిగినదని నమ్ముటకు కారణములేకుండ సదరు గుత్తగాడు బాడుగను గుత్తకిచ్చువానికి చెల్లించినపక్షమున సదరు గుత్తగాడు అట్టి బాడుగను తిరిగ పరివర్తన చేయుకొనువానికి చెల్లించు [illegible] యుండగూడదు.

గుత్తకిచ్చువాడును, పరివర్తన కయికొనువాడును గుత్తగాడును సదరుగుత్తవలన నేర్పఱుపబడిన పరివర్తిత భాగమునకు గాను ఎంతమాత్రము, గుత్తధనమో లేక బాడుగయో, చెల్లింపదగియుండునో దానిప్రమాణమును నిర్ణయింపవచ్చును. వారిలో వారికి సమాధానము కుదరనిపక్షమున అట్టినిర్ణయమును గుత్త ఆస్తిని స్వాధీనపఱుచుటకయి తేబడు వ్యాజ్యమును దాఖలుచేసికొనుట కధికారముగల కోర్టువారు చేయవచ్చును.

గడువుకాలము ప్రారంభమగు దినమును వదలిపెట్టుట.

౧౧౦. స్థిరాస్తి గుత్తలో పరిమితి యేర్పఱుపబడి యున్నకాలము ఫలాని దినము మొదలు ప్రారంభమగునని చెప్పియున్నపుడు సదరు కాలమును లెక్కించుటలో ఆ దినమును చేర్చికొనగూడదు. ప్రారంభమేదినము మొదలుకొనియగునో ఆ దినమును పేర్కొనియుండని యెడల అట్లు పరిమితి యేర్పఱుపబడిన దినము గుత్తకు తీసికొన్నది మొదలు ప్రారంభమగును.

గుత్తగడువు సంవత్సరముదాకనుండుట.

అట్లుపరిమితి యేర్పఱుపబడిన కాలమొక సంవత్సరమైనను లేకకొన్ని సంవత్సరములయినను అయియున్నపుడు, విరుద్ధముగా స్పష్టమయిన ఒడంబడిక లేనిచో, అట్టి కాలము ప్రారంభమగు దినమేదో దాని సంవత్సర దినమునకు యావత్తుకును సదరుగుత్త చెల్లవలయును.

గుత్త కడముట్ట జేయుట యథేచ్ఛము.

అట్లు పరిమితి యేర్పఱుపబడినకాలము, అది గడిచిపోవకమునుపే అంతమొందవలయునని చెప్పియున్నపుడును, సదరు గుత్తలో ఫలానివాని యిష్టమునుబట్టి అది అంతమొందవలయునని చెప్పకపోవునపుడును, గుత్తకిచ్చువానికి అట్టి యిష్టముండవలయును.

గుత్తయొక్క అంతము.

౧౧౧. (ఎ) ఒడంబడికలో పరిమితి ఏర్పఱచియున్నకాలము గడుచుటవలనను,



(బి) అట్టి కాలము ఒకానొక కార్యము సంభవించిన మీదటనను షరతుమీద పరిమితి యేర్పఱుపబడి యున్నపుడు అట్టి కార్యము సంభవించుటవలనను,

(సి) గుత్తకిచ్చువానికి ఆస్తిమీదగల బాధ్యత ఒకసంగతి సంభవించిన మీదట అంతమొందవలయుననియు, లేక దానిని పరిష్కరించుటకు గలవానియధికారము సదరుసంగతిసంభవించుదాక ఉండుననియు,ఉన్నపుడు అట్టిసంగతి సంభవించుటవలన,

(డి) గుత్తగానికిని గుత్తకిచ్చువానికిని గల సదరుయావత్తు ఆస్తి బాధ్యతలను ఒక కాలమందే ఒక హక్కును అనుసరించే ఇంకొకని కిచ్చివేసిన సంగతిలో,

(ఇ) స్పష్టముగా వదిలివేయుటవలన, అనగ వారి సమ్మత, నన్యోన్యముగ గుత్తను అనుసరించిన తన బాధ్యతను గుత్తగాడు గుత్తకిచ్చువానికిచ్చివేయుసంగతిలో,

(యఫ్) సూచనగా వదిలివేయుటవలన,

(జి) వదలుకొనుటవలన, అనగ — (౧) ఏ షరతును భంగపఱిచిన గుత్తకిచ్చువాడు మరల ఒడంబడిక చేసికొనవచ్చునో లేక దేనిని భంగపఱిచిన సదరు గుత్త రద్దుఅగునో దానిని ఏర్పాటుచేయు బహిరంగమయిన షరతును గుత్తగాడు ఉల్లంఘించునపుడు; లేక (౨) గుత్తగాడు అట్టివాడుగ ఒకహక్కును అన్యునియందు కల్పించుటవలనను, లేక సదరు హక్కును తనయందే ఉంచుకొనుటవలనను, తనయోగ్యతను వదిలిపెట్టుకొనుసంగతిలోను, ఏ సంగతిలోనయినను గుత్తకిచ్చువాడుగాని, లేక అతని పరివర్తనకయికొనువాడుగాని, సదరు గుత్తను కడముట్టించుటకు తన ఉద్దేశమును చూపుచు ఏదయినఒక కార్యముచేయునపుడును,

(యచ్) సదరుగుత్తను అంతమునొందించుటకుగాని గుత్త ఆస్తిని వదిలిపెట్టుటకుగాని, లేక వదిలిపెట్టు ఉద్దేశమునుగుఱించి ఒక కక్షిదారుడు మఱియొకనికి క్రమముగ ఇచ్చిననోటీసు గడిచినమీదట,

స్థిరాస్తి గుత్త అంతమొందును.

(యఫ్) క్లాజుకు దృష్టాంతము.

గుత్తగాడొకడు తనకు గుత్తకిచ్చువానివద్ద, తనకుంచుండిన గుత్త జరుగుచుండగనే అమలులోనికి వచ్చునట్లు గుత్త ఆస్తిమీద క్రొత్త గుత్తను అంగీకరించును. ఇది మొదటిగుత్తను వదలుకొనుటకు సూచనయయి యుండును, అట్టిగుత్త అందుమీదట అంతమగును.

దండుగపై హక్కునువదలుకొనుట.

౧౧౨. ౧౧౧వ సెక్షను (జి) క్లాజును అనుసరించి గుత్తపోకడ, అట్లు వదలుకొన్నది మొదలు బాకీగానుండిన బాడుగను తీసికొనుటవల్లగాని, లేక అట్టి అద్దెకుగాను జప్తుచేయుట వల్లగాని, లేక గుత్త జరుగుచుండులాగు ఉద్దేశమును కనబఱుచు గుత్తకిచ్చువాడు ఇతర కార్యమును దేనినయిన చేయుటవల్లగాని రద్దుచేయబడును:

కాని సదరు గుత్తపోకడ సంభవించినదని గుత్తకిచ్చువాడు ఎఱిగియుండవలయును:

మఱియు గుత్తపోకడ కారణముచేత సదరు గుత్తకానిని వెళ్లగొట్టుటకుగాను వ్యాజ్యెమును తెచ్చినతర్వాత బాడుగను గ్రహించుసంగతిలో, అట్టి గ్రహణము గుత్తరద్దుకానేరదు.

విడిచిపెట్టుటకునోటీసుచేయక వదలుకొనుట.

౧౧౩. ౧౧౧వ సెక్షను (యచ్) క్లాజునుబట్టి ఇయ్యబడిన నోటీసు, ఎవనికి అది యియ్యబడుచున్నదో వానియొక్క స్పష్టమయినట్టిగాని, లేక భావగర్భితమయినట్టిగాని సమ్మతితో సదరు గుత్త జరుగుదలలోనున్నట్లు తలంచుటకు ఉద్దేశమును కనపఱుచుచు నోటీసును ఇచ్చువాడు ఏదయిన కార్యమును జరిగించిన యెడల, త్యజింపబడును.



దృష్టాంతములు.

(ఎ) గుత్తకిచ్చువాడైన ఎ అనువాడు సదరు గుత్త ఆస్తిని వదిలిపెట్టుమని గుత్తకాడయిన బి అనువానికి నోటీసును ఇచ్చును. సదరు నోటీసులోని గడువు గడిచిపోవును. సదరునోటీసులోని గడువుగడిచిపోయినది మొదలు సదరుఆస్తిమీదబాకీగనిలిచియుండు బాడుగను బి అనువాడు ఇయ్యగా ఎ అనువాడును దానిని గ్రహించును. సదరు నోటీసు రద్దుచేయబడును.

(బి) గుత్తకిచ్చువాడైన ఎ అనువాడు సదరు గుత్త ఆస్తి వదిలిపెట్టుమని గుత్తకాడయిన బి అనువానికి నోటీసును ఇచ్చును. సదరు నోటీసులోని గడువుగడిచిపోవును, తర్వాతను బి అనువాడు దానిని స్వాధీనములోనె ఉంచికొనియుండును. ఎ అనువాడు దానిని వదిలిపెట్టుమని బి అనువానికి గుత్తకాడుగనె రెండవ నోటీసును ఇచ్చును. మొదటినోటీసు రద్దుచేయబడును.

బాడుగను చెల్లింపనందుకై దండుగ పెట్టుటకు పరిహారము.

౧౧౪. స్థిరాస్తిగుత్త, బాడుగను చెల్లింపనందున గుత్తపోకడమూలముగ అంతమొంది గుత్తకిచ్చువాడు గుత్తకానిమీదవిడిచిపెట్టి వెళ్లుటకుగాను వ్యాజ్యము తెచ్చు సంగతిలో, సదరు వ్యాజ్యవిచారణ కాలమందు బాకీలోఉన్నబాడుగను దానిమీదనగువడ్డీని సదరువ్యాజ్యతగులుబడులను పూర్తిగనుచేర్చి గుత్తగానికిచెల్లించిగాని చెల్లింపవచ్చిగాని వున్నపక్షమందు లేకఅట్లుఆసైకమును పదునేనుదినములలోగ చెల్లించుటకు దగినదని కోర్టువారుతలచునట్టి జాకట్టునుపెట్టిగాని యుండుపక్షమందు సదరు కోర్టువారు సదరుగుత్తను త్రోసివేయుటకు డిక్రీని ఇచ్చుటకు బదులు గుత్తగానికి అట్టిగుత్త పోకడపడకుండగ చేయుచు ఉత్తరువు ఇయ్యవచ్చును. మఱియు అందుమీదట సదరు గుత్తకాడు సదరు పోకడ సంభవింపకున్ననెట్లో అట్లే సదరుగుత్త ఆస్తిని ఆక్రమించుకొనవలయును.

అప్పగింతవల్లను దండుగ పెట్టుకొనుటవల్లను లోగుత్తలకు ఫలము.

౧౧౫. స్థిరాస్తిగుత్తను స్పష్టముగనయిన భావగర్భితముగనైన అప్పగింత చేయుటవలన (అద్దెముత్తము విషయము లోతప్ప) మొదటి గుత్తకుగల ఒడంబడిక షరతులవలెనే సేనామట్టుకునాని మూలముగనె గుత్తగాడు పూర్వమిచ్చియున్న ఆస్తి సంబంధమయి

నట్టిగాని అందుల ఏ భాగము సంబంధమైనట్టిగాని లోగుత్తకు బాధకము కలుగనేరదు. కాని క్రొత్త గుత్తను తీసికొనుటకుగాను అప్పగింత చేసిననే లోగుత్తపుచ్చుకొనువాడు చెల్లింపవలయు అద్దెయు నెఱవేర్పవలయు కరారులను వరుసగ గుత్తగానికి చెల్లించి అతడు దానిని చలాయించుకొనగలిగియుండును.

అట్టి గుత్త పోకడను లోగుత్తకాండ్రను దగాచేసి గుత్తకిచ్చువాడు జరిగించు పక్షమునను లేక సదరు పోకడకు పైపోటిగ ౧౧౪గో సెక్షనును బట్టి పరిహారము కలుగజేసియున్న పక్షమందును తప్ప, అట్టి గుత్త పోకడవల్ల అట్టి లోగుత్తలన్నియు రద్దు అగును.

ఇంకను అను భావించుచుండుటవలని ఫలము.

౧౧౬. ఆస్తినిగుత్తకుగాని లోగుత్తకుగాని తీసికొనువాడుగాని సదరు గుత్తగానికిచ్చిన గుత్త అంతమైనతర్వాత సదరు ఆస్తిని స్వాధీనమందుంచుకొని గుత్తకిచ్చువాడైనను లేక న్యాయశాస్త్ర సమ్మతమయిన అతని ప్రతినిధియైనను సదరు గుత్తగానివద్దనుండిగాని లేక లోగుత్తగాని వద్దనుండిగాని బాడుగను గ్రహించుపక్షమందు లేదా తనస్వాధీనమందుంచుకొనుటకు మఱియొకరీతిని సమ్మతించుపక్షమందు, అన్యథా ఒడంబడిక లేనిచో, ఆగుత్త ౧౦౬రో సెక్షనులో వివరించియున్నప్రకారము సదరుఆస్తి ఎందుకొఱకు గుత్తకియ్యబడెనో ఆ కార్యమునకు దగినట్లు ఒక సంవత్సరము నుండి మఱియొక సంవత్సరము వఱకయినను ఒకనెలనుండి మఱియొకనెల వఱకయినను మరల క్రొత్తగా చేసికొనబడును.

## దృష్టాంతములు.

(ఎ) ఎ అనువాడు ఒకయింటిని బి అనువానికి అయిదు సంవత్సరములకు బాడుగకు ఇచ్చును. బి అనువాడు ఆయింటిని నెలకు నూఱు రూపాయలచొప్పున సి అనువానికి లో బాడుగ కిచ్చును. సదరు అయిదు సంవత్సరములు గడిచి పోయినను సి అనువాడు తన స్వాధీనమందుంచు కొనుచు ఎ అను వానికి బాడుగను చెల్లించును. సి అనువాని గుత్త నెలనెలకు క్రొత్తగా ఇయ్యబడును.



(బి) ఎ అనువాడు సి అనువాని జీవితపర్యంతము బి అనువానికి ఒకగుత్తనేలను బాడుగకిచ్చును. సి అనువాడు చచ్చును, అయినను బి అనువాడు ఎ అనువాని అనుమతినిపొంది దానిని స్వాధీనములో నుంచుకొనును. బి అనువాని గుత్త సంవత్సర సంవత్సరమునకు క్రొత్తగ తీసికొనవలసియుండును.

వ్యవసాయ కార్యములకు గుత్తలను మినహాయించుట.

౧౧౭. ఈ యధ్యాయములోని నిబంధనలేవియు, తత్కాలమందు ప్రదేశ చట్టమేదయిన అమలులో నుండునెడల అందుల నిబంధనతోగూడ లేక వానిలోబడి ప్రదేశ గవర్న్మెంటువారు ఆలోచనసభలోని గవర్నర్ జనరల్ గారి అనుమతిని (శాంక్షనును) ముందుగా పొంది లోకల్ అఫిషల్ గెజెట్లో ప్రచుర పఱుపబడు ప్రకటన ద్వారా సంబంధపడులాగు అట్టి నిబంధనలనన్నిటినిగాని వానిలో కొన్నిటినిగాని ప్రకటనచేయుదాక తప్ప, వ్యవసాయ వ్యవహారముల గుత్తలనుసంబంధపడగూడదు.

అట్టిప్రకటనను ప్రచురపఱిచిన తేదిమొదలు ఆఱుమాసములు గడుచువఱకును ఆ ప్రకటన సఫలముకాగూడదు.

---

## ౬గో అధ్యాయము.

(వినిమయముల) మాఱుపుల గురించి.

"(వినిమయము) మాఱుపు" నిర్వచనము.

౧౧౮. ఒక వస్తువుయొక్క స్వామ్యమునకు ప్రతిగ మఱియొక వస్తువుయొక్క స్వామ్యమును పరస్పరముగ నిరువురు మనుష్యులు పరివర్తనచేసికొని ఆ వస్తువులలో ఏదైనను ద్రవ్యముగా మాత్రమే ఉండని యెడల లేక రెండును ద్రవ్యముగా మాత్రమేయుండిన యెడల, ఆవ్యవహారము "వినిమయము" అనబడును.

వినిమయమును నెఱవేర్చుటకు ఆస్తిని పరివర్తనచేయునప్పుడు అట్టి ఆస్తి పరివర్తనకుగాను ఏపద్ధతి యేర్పఱుపబడి యున్నదో ఆ పద్ధతినిబట్టి విక్రయమూలముగమాత్రమే ఆ స్తిపరివర్తన జరుపుకొనగూడును.

వినిమయముగ పుచ్చుకొన్నవస్తువు పోగొట్టుకొనబడినవాని హక్కు.

౧౧౯. అన్యథా కరారులేనిచో, వినిమయమూలకముగ తనకు లభించిన వస్తువుకాని అందలిభాగము గాని ఇతరకక్షిదారుని హక్కునందుగల లోపము చేని కారణమువలననైన పోయిన కక్షిదారుడు అతనియిష్టమును బట్టి ప్రతికార ద్రవ్యమునకయినను లేక అతడు పరివర్తన చేసిన వస్తువు యొక్క పునః ప్రాప్తికయినను హక్కు కలిగియుండును.

కక్షిదారుల హక్కులును జవాబుదారీలును.

౧౨౦. ఈ అధ్యాయమందు మఱియొక విధముగ ఏర్పాటు చేయబడియుండిన దప్ప తాను ఇచ్చిన దానికిగాను విక్రయించినవానికిగల హక్కులనుగలిగి అతనికిగల జవాబుదారీలకు లోనయి మఱియు తానుకయికొన్న దానికిగాను కొనువానికిగల హక్కులనుగలిగి వానిజవాబుదారీలకు లోనై ప్రతి కక్షిదారుడును ఉండును.

ద్రవ్యవినిమయము.

౧౨౧. ద్రవ్యవినిమయమందు ప్రతికక్షిదారుడును తానిచ్చుపయికము సరియయినదని అందుమూలముగ రూఢిచేయును.

---

## ౭ వ అధ్యాయము.

### దానములను గుఱించి.

"దానము"నిర్వచనము.

౧౨౨. "దానము" అనగ దాతఅనువాడు స్వచ్ఛందముగాను ప్రతిఫలమును పొందకుండను ప్రతిగ్రహీత అను మఱియొకని కియ్యబడి ఆప్రతి గ్రహీతవలన గాని అతని తరఫునగాని గ్రహింపబడిన నిజమయిన ఒకానొక చరాస్తిని గాని స్థిరాస్తినిగాని పరివర్తనచేయుట.

ప్రతి గ్రహణము ఎప్పుడు చేయునది.

దాతజీవించి యుండునపుడును అతనికిదానముచేయు సమర్థత ఉండియున్నపుడును అట్టి గ్రహణము గ్రహింపబడవలయును.



తద్గ్రహణ పూర్వమె ప్రతి గ్రహీత మృతుడగునెడల తద్దానమువ్యర్థయగును.

పరివర్తన ఎట్లు సిద్ధించునది.

౧౨౩. స్థిరాస్తి దానమునుచేయుటకుగాను సదరు పరివర్తన దాతగాని వానితరఫున ఇంకొకడుగాని చేవ్రాలు చేసినట్టియు దానికి కనీసము ఇరువురు సాక్షిచేవ్రాలు చేసినట్టియు రిజిస్టరు దస్తావేజు మూలముగ సఫలముకావలయును.

స్థిరాస్తి దానము చేయుటకుగాను పయిన చెప్పినప్రకారము సంతకములనుగలిగిన రిజిస్టరు దస్తావేజుమూలముగనో లేక అప్పగింతమూలముగనోసదరు పరివర్తన సఫలముచేయవచ్చును.

విక్రయింపబడిన సరకును అప్పగించు విధముగనె అట్టిచరాస్తిని అప్పగింతచేయవచ్చును.

ప్రస్తుతపు ఆస్తిని, భావికాలపు ఆస్తిని, దానముచేయుట.

౧౨౪. అప్పటి కుండునట్టియు ఉండగలట్టియు రెండువిధములగు ఆస్తిని దానము చేయుచో అట్టిదానము రెండవవిషయమున చెల్లదు.

పలువురిలో నొకడుగ్రహింపనపుడు పలువురికిదానము.

౧౨౫. ఇరువురుగాని ఎక్కువమందిగాని ప్రతిగ్రహీతలకు ఒకవస్తువు దానముచేయబడి వారిలో నొకడు దానిని గ్రహింపనియెడల అట్టిదానము, అతడు గ్రహించినపక్షమున కలుగబోవుచుండు హక్కును గుఱించి, చెల్లదు.

దాన మెపుడు నిలుపుదలచేయునది, లేక త్రిప్పివేయునది.

౧౨౬. దాత యిష్టమునుబట్టి సంభవింపని ఫలానిసంగతి యేదయిన సంభవించినమీదట దానము సస్పెండుచేయబడను గాని రద్దు చేయబడను గాని వలయునని దాతయు ప్రతిగ్రహీతయు ఒప్పుదల చేసికొనవచ్చును; గాని దాత యిష్టమునుబట్టి దానము

యావత్తుగాని కొంత భాగముగాని రద్దు కావలయునని కక్షిదారులుచేసికొను ఒడంబడికను అనుసరించిన దానము సందర్భప్రకారము యావత్తు లేక కొంతభాగము రద్దుగాదగియుండును.

మఱియువేనిలోసదరు దానము రద్దుచేయబడగూడునో అట్టి సంగతులలో దేనిలోనయినను (ప్రతిఫలము లేకుండనయినను లేక ఇయ్యక తప్పిపోయియుండినను తప్ప) సదరు దానమును కరారు అయినయెడల ఎట్లో అట్లే రద్దుచేయవచ్చును.

పైనచెప్పిన విధమునదప్ప దానమును రద్దుచేయగూడదు.

నోటీసులేకుండ ప్రతిఫలమునిచ్చి పరివర్తన కయికొనువారి బాధ్యతలకు బాధకము కలుగునట్లు ఈ సెక్షనులోనుండు దేనినిగ్రహింపగూడదు.

దృష్టాంతములు.

(ఎ) ఎ అనువాడు బి అనువానికొక పొలమునిచ్చి సదరు బి అనువాడు వానివంశస్థులును తనకుముందు చనిపోవునెడల ఆపొలముతాను తిరుగ పుచ్చుకొనగల హక్కును బి అనువాని అనుమతిమీద తనకు ఉంచుకొనును. ఎ అనువాడు బ్రతికి యుండగ బి అనువాడు సంతతి లేకయే చనిపోవును. ఎ అను వాడు ఆ పొలమును తిరుగ తీసికొనవచ్చును.

(బి) ఎ అనువాడు బి అనువానికి లక్షరూపాయలు ఇచ్చును. గాని తనయిష్టమువచ్చినపుడు ఆలక్ష రూపాయలలోనుండియు ౧౦,౦౦౦ రూపాయలను మరల తీసికొనుహక్కును బి అనువాని అనుమతినిపొంది తనకుంచుకొనును. ౯౦,౦౦౦ రూపాయలకు ఆ దానము చెల్లుబడియగునుగాని ఎ అనువానిదిగా ఉన్న ౧౦,౦౦౦ రూపాయలకు చెల్లుబడికాదు.

౧౨౪. అనేకవస్తువులలో నొకదానిమీదజవాబుదారీమోపబడి ఇతరమయినవానికై ఏ జవాబుదారికిని లోబడకుండు నపుడు అట్టి అనేక వస్తువులు ఒక్కనికే ఒకపరివర్తనమూలముగనే దానముచేయబడి యుండునెడల ప్రతిగ్రహీత దానినిపూర్తిగా గ్రహించిననేతప్ప అందువలన అతడేమియును పొందడు.

జవాబుదారి మోపునట్టి దానములు.



అనేకవస్తువులును ఒక్కనికే ఒకదానికొకటి సంబంధములేకుండ ప్రత్యేకముగ రెండుగాని లేక ఎక్కువగాని పరివర్తనల మూలముగ దానముచేసినపక్షమున వానిలో ఒకటి లాభకరమయినదిగను యితర మయినవి దుస్సహమయినవిగను ఉండినను ఆయొకదానిని ప్రతిగ్రహీత నిరాటంకముగ గ్రహించి ఇతరమయినవివానిని గ్రహింపక నిరాకరింపవచ్చును.

కరారుచేయనర్హతలేని ప్రతిగ్రహీత ఏదయిన జవాబుదారీ భారముగల ఆస్తిని గ్రహించునెడల ఆ గ్రహణమువలన నతడు దానికిబద్ధుడుగాడు. గాని కరారుచేయుటకు సమర్థుడయి జవాబుదారీవున్నదని తెలిసికొనినతర్వాత నియ్యబడిన ఆస్తిని అతడు వుంచుకొన్నయెడల అతడు ఆప్రకారము బద్ధుడగును.

అనర్హునకు జవాబుదారీ మోపెడు దానము.

దృష్టాంతములు.

(ఎ) ఎ అనువానికి ఎక్స అను మంచిస్థితిలోనున్న జాయింటు స్టాక్ కంపెనీలోను కష్టదశలోనున్న వై అను జాయింటు స్టాక్ కంపెనీలలోను భాగములుగలవు. వై అను కంపెనీలో అతిశయముయిన అక్కరలున్నట్లు భావింపబడును. సదరు జాయింటు స్టాక్ కంపెనీలలో తాను ఉంచికొనియున్న భాగములనన్నిటిని ఎ అనువాడు బి అను వానికిచ్చును. బి అను వాడు వై అను కంపెనీలోని పాళ్లను అంగీకరింపక నిరాకరించును. ఎక్స అను కంపెనీలోనున్న అతనిభాగములను అతడు పుచ్చుకొనజాలడు.

(బి) ఎ అనువాడుకొంతబాడుగ మొత్తమునకు ఒకఇంటిని కొన్ని సంవత్సరములకాలమువరకు గుత్తనుతీసికొనియుండును. ఆకాలమువరకు అతడు అతని ప్రతినిధులును ఆమొత్తమును చెల్లించుటకు బద్ధులయి యుందురు, మఱియు ఆ యింటి కెంత బాడుగ తీసికొనవచ్చునో అంతకా మొత్త మధికముగానుండును. ఆ ప్రకారముబాడుగకు అనుభవించును. ఎ అనువాడు బి అనువానికిచ్చినదిగాకుండ దీనికి సంబంధపడకుండ ప్రత్యేక వ్యవహారముగ ఒక మొత్తమునుగూడ ఇచ్చును. బి అనువాడు అలాగు బాడుగ కనుభవించుట వద్దని నిరాకరించును. అలాగు నిరాకరించుటవల్ల అతడా మొత్తమునువదులుకొనును.

౧౨౮. ౧౨౭ వ సెక్షనులోని నిబంధనలకులోనయి దాత తనయావ

ఆస్తియాసత్తుకు ప్రతిగ్రహీత.

దాస్తిని దానముచేయు సందర్భములో చెప్పియున్న ఆస్తి వ్యాప్తి వఱకు దానకాలమందు దాత ఇయ్యవలయు అన్ని ఋణములకు ప్రతిగ్రహీత స్వయముగ జవాబుదారిగ నుండును.

౧౨౯. ఈయధ్యాయములోనుండు నేదియు మరణవిషయమును మన

మరణ కారణము వలన చేయబడిన దానములను మహమ్మదీయ ధర్మశాస్త్రమును మినహాయించుట.

స్సున పెట్టుకొని చేయు చరాస్తి దానములకు సంబంధపడదు, లేక మహమ్మదీయ చట్టముయొక్క ఏపద్ధతికయినను లేదా ౧౨౩ డో సెక్షనును బట్టి ఏర్పాటుచేయబడిన ప్రకారముగాక హిందువునకు లేక బౌద్ధమతస్థునికి సంబంధపడు నట్టి చట్టముయొక్క యే పద్ధతికిని బాధకము కలుగచేయునట్లు భావింపగూడదు.

---

౮ వ అధ్యాయము.

వ్యాజ్యము చేయతగ్గ దావాల పరివర్తనలను గుఱించి.

౧౩౦. పరిహారమునకుగాను ఆధారములను కలుగజేయునట్లు సివిల్

"వ్యాజ్యము చేయతగ్గ దావా" నిర్వచనము.

కోర్టువారలు ఒప్పుకొనునట్టి ఒకదావాను అమలులోనికి తేగలందులకు వాస్తవముగ వ్యాజ్యము జరుగుచుండినను జరుగకుండినను వ్యాజ్యము తెచ్చుట సేనామట్టుకు ఆవశ్యకముగానుండినను ఉండకపోయినను సదరహి వ్యాజ్యము చేయతగ్గ దావా అగును.

౧౩౧. ఋణదాతగాని ఎవనికి చరాస్తికలుగజేయబడునో వాడుగా

ఋణ పరివర్తనము.

ని ఏదయిన ఋణమునయినను లాభకరమయిన బాధ్యతనయినను పరివర్తన చేయుటతో జేరియుండినగాని లేక అట్టి పరివర్తన విషయమును మఱియొకవిధముగ నెఱిగియుండినగాని సదరు పరివర్తనను గుఱించి స్పష్టమైన నోటీసును అతని కిచ్చువఱకును అట్టి పరివర్తనఏదియు అతనికి విరుద్ధముగ చెల్లుబడికాగూడదు. మఱియు సదరు పరివర్తనతో జేరకుండను దానిని మఱియొక రీతిని ఎఱుగకుండను దానినిగుఱించి స్పష్టముగనోటీసును పొందకుండను ఉన్నటువంటి అట్టి ఋణప్రదాతగాని ఆస్తి ఎవనికీబడుచున్నదో వాడుగాని సదరు అప్పునుగుఱించియయినను ఆస్తినిగుఱించియయినను జరిగించు ప్రతి విషయము అట్టి పరివర్తనతో నిమిత్తములేకుండ చెల్లుబడికావలయును.

దృష్టాంతము.

ఎ అనువాడు బి అనువానికి కొంత పయికమును బాకి పడియుండును. బి అనువాడా ఋణమును సి అనువానికి పరివర్తనచేయును. తర్వాత బి అనువాడు ఆ ఋణమునకై ఎ అనువానితో తగాదా చేయును. ఎ అనువాడా పరివర్తనను గుఱించి నోటీసును పొందకయే బి అనువానికా ఋణమును చెల్లించివేయును. అట్లు ఆ ఋణమును చెల్లించుట చెల్లుబడియగును; సి అనువాడా ఋణమునకుగాను ఎ అనువాని మీద వ్యాజ్యమును తేగూడదు.

౧౩౨. అట్టి ప్రతిపోటీసును లిఖిత మూలకమయి యుండవలయును,

నోటీసు వ్రాత మూలముగ చేవ్రాలుకలిగియుండవలయును.

దానిలో పరివర్తనచేయువాడుగాని దీనికిగాను తాను క్రమమయిన అధికారమును కలగజేసిన తన ఏజెంటుగాని చేవ్రాలు చేయవలయును.

౧౩౩. అట్టినోటీసును అందుకొన్న మీదట ఋణ ప్రతిగ్రహీతగాని

ఋణగ్రస్తుడు పరివర్తనకు అమలు కల్పించుట.

లేక ఆస్తిఎవనికీబడునో వాడుగాని పరాయిదేశములో వాసముచేయు విషయములోను లేక ఆస్తిపరాయిదేశములోనుండువిషయములోను ఎవనిపేరట పరివర్తన చేయబడియున్నదో ఆమనుష్యునియొక్క హక్కు అట్టిదేశములోని చట్టముప్రకారము పూర్ణముగాని విషయములోను గాక, ఆపరివర్తనను సఫలముచేయవలయును.

౧౩౪. ఋణమును పరివర్తన చేయువాడు, ఋణస్థుడు ఋణమును చెల్లింప శక్తికలవాడని రూఢిగా చెప్పు విషయములో, అన్యథాకరారు లేనిచో, అలాగు రూఢిగా చెప్పుట పరివర్తన కాలమందుమాత్రమే ఆతడు ఋణమును చెల్లింప శక్తిగలిగియుండుటకు ప్రయోగపడునదే గాక ప్రతిఫలమునకుగాను పరివర్తన చేయువిషయములో అట్టి ప్రతి ఫలము మొత్తమునకు గాని కిమ్మతుకు గాని పరిమితి యేర్పఱుపబడును.

ఋణగ్రస్తుడు ఋణము చెల్లింప శక్తిగలవాడని రూఢి చేయుట.

౧౩౫. వ్యాజ్యము చేయతగ్గ దావా విక్రయింపబడు నెడల అది ఎవనికి వ్యతిరిక్తముగ చేయబడునో అతడా విక్రియము మొత్తమును అందుకుతగులుబడియయిన ఖర్చులను కొన్నవాడు విక్రయ ధనమును చెల్లించిన తేది మొదలుకొని దానిపయిన వడ్డీనిగూడకొనువానికి చెల్లించిన మీదట అతడు సదరు జవాబు దారినుండి పూర్ణముగ విముక్తుడగును.

ఎవనిమీద దావాహక్కు అమ్మబడినదో వాని విడుదల చేయుట.

ఈ సెక్షనులోని ప్రథమభాగములో నుండునది యేదియు—

(ఎ) సదరు విక్రయము చేయబడిన దావాబాధ్యతకు తోడివారసుగాగాని తోడిపాలికాపుగాగాని ఉండువానికి సదరు విక్రయము చేయబడునెడను;

(బి) ఋణప్రదాతకు బాకియున్నదానికి చెల్లుగా అతనికి విక్రయము చేయబడునెడను;

(సి) వ్యాజ్యార్హమగు దావాబాధ్యతకులోనైన ఆస్తిని స్వాధీనపఱుచుకొనువానికి విక్రయము చేయబడునెడను;

(డి) దావా బాధ్యతకలదని అర్హమైనకోర్టువారు తీర్పు చేసియుండునెడను లేక సదరుబాధ్యతకలదని సాక్ష్యము ద్వారా స్పష్టముగా తెలియవచ్చి తీర్పు ఇచ్చుటకు సిద్ధముగానుండునెడను;

ప్రయోగపడదు.



౧౩౬. జడ్జిగాని ప్లీడరుగాని ముఖ్త్యారుగాని గుమాస్తాగాని వేయిటిఫ్ గాని న్యాయవిచారణ కోర్టులలో సంబంధించిన ఇతర ఉద్యోగస్థుడుగాని తాను అధికార ధర్మములను ఎక్కడ చెలాయించునో ఆ కోర్టువారి యధికారము క్రిందికివచ్చు వ్యాజ్యార్హమగు దావాభాధ్యతకు దేనిని క్రయమునకు తీసుకొనగూడదు.

న్యాయవిచారణకోర్టుల కుసంబంధించిన అధికారుల అసమర్థత.

౧౩౭. ఋణముగాని పూచీగాని యెవరికి పరివర్తన చేయబడునో ఆమనుష్యుడు పరివర్తన లేదికి పరివర్తన చేయువాడు దానినిగుఱించి ఏపూచీలకు లోబడియుండునో ఆపూచీలకన్నింటికి లోబడినవాడై దానిని చేకొనవలయును.

ఋణమును పరివర్తన చేకొనువానిజవాబు దారీ.

దృష్టాంతము.

ఒక పబ్లికు సమూహమువారికి మోసకరముగా ఎ అనువాని కొక అప్పుపత్రము వ్రాసిజారీచేయబడును. ఎ అనువాడు ఆపత్రమును బి అనువానికి విక్రయించి పరివర్తన చేయును, కాని సదరు మోసమునుగుఱించి బి అనువానికి నోటీసు ఇయ్యబడలేదు; బి అనువానికా అప్పుపత్రము చెల్లదు.

౧౩౮. ప్రకృతమయినట్టిగాని భవిష్య సంబంధమయినట్టిగాని ఋణమును భద్రము చేయుటకు ఋణమిచ్చినపరివర్తన చేయబడియుండు నెడల ఆపరివర్తన చేయువాడుగాని పరివర్తనకై కొనువాడుగాని అలాగుపరివర్తన చేయబడినఋణమును వసూలు చేసుకొన్న, మొదట, అలాగువసూలుచేయుటకుగాను తగులుబడియైన ఖర్చును చెల్లుగాను, రెండు, పరివర్తనవలనవచ్చు లమునను భద్రపరుపబడిన మొత్తమునకు చెల్లుగాను ఉపయోగింపబడవలసినదగును. మిగతయేదైన నున్నయెడల అది పరివర్తన చేయువానికి చెందును.

తాకట్టుగల ఋణము.

౧౩౯. ఈఅధ్యాయ మందుండునది ఏదియు చెల్లదగిన (నిగోషియబిల్) పత్రములకు ప్రయోగపడదు.

చెల్లదగిన (నిగోషియబిల్) పత్రముల మినహాయింపు.